# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 16-1-1979 | సంచిక 6

—* ఈ సంచికలో *—



1—2—79 సంచికలో తిక్కన మోక్షనిర్వచనము, శివభారత సమాలోచన, తెలుగుకవితకు జీవంపోసిన క్షేమేంద్ర మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై

# వేణీసంహారము - నాయకుడు

— డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం. ఏ., పి హెచ్. డి.

క్రీ. శ. ఏడవశతాబ్దిలో వసించినభట్టనారాయణుడు వేణీసంహార మను ఆరు అంకముల నాటకమును సంస్కృతమున రచించెను. ఇందు నాటక లక్షణములన్నియు క్రమముగా పాటింపబడినవి. భట్టనారాయణుడు వేణీసంహారమందు కొన్ని క్రొత్తకల్పనలను చేసెను. భాష శక్తిమంతమై వీరరసానుగుణముగా ఉన్నది. ఇందు రమణీయములైన దృశ్యములు పెక్కులు గలవు. కాని అందు సుసంఘటితములుగా లేనందున వస్త్వైక్యమునకు ఇంచుక కొరత వాటిల్లినది. అయినను ప్రౌఢరీతిని సంతరింపబడిన వేణీసరహారమునకు సంస్కృతరూపక చరిత్రలో ప్రముఖస్థానము కలదు. అట్టిదీనిని వడ్డాది సుబ్బరాయకవి (1855-1938) అంత ప్రౌఢముగాను తెలుగులోనికి 1886వ సంవత్సరమున అవతరింపచేసినారు. వీరు నాటక ప్రదర్శనములందు పాత్రలు గైకొని నటించిన నటులుకూడ. వీరికి వ. సు. రాయకవి యనియు వ్యవహారముండెను. వీరు ధర్మరాజు పాత్రను, అశ్వత్థామ పాత్రను శక్తిమంతముగా అభినయించిరి. తొలి తెలుగు నాటక కర్తలలో భూమికాధారణము చేసిన ప్రథములు సుబ్బరాయుడుగారే. ఇట్లు ఉత్తమ నాటకకర్త, నటుడు అయిన వీరు ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ప్రత్యేక స్థానముకలిగియున్నారు. నాటినుండి ఒక అర్ధశతాబ్దముపాటు ఈ ఆంధ్ర వేణీ సంహారము తెలుగు నాటకరంగమున జైత్రయాత్ర చేసినది.

ఈ నాటకమున ముఖ్యముగా కొన్ని మహాభారతయుద్ధ సంఘటనలను స్వీకరించి, చివరకుభీముడు దుర్యోధనుని వధించి ద్రౌపది కొప్పుముడుచుట వరకుఁగలకథ వర్ణింపబడినది. దీనినిబట్టియే యీ నాటకమునకు వేణీసంహార మను నామము కలిగినది.

ప్రథమాంకములోని భానుమతీ పరిహాసోక్తులు, ద్వితీయాంకములోని భానుమతీ స్వప్నదర్శనాది వృత్తాంతము, చతుర్థాంకమున గాంధారీధృతరాష్ట్రులు యుద్ధరంగమునకు వచ్చుట, షష్ఠాంకములో చార్వాకునికల్లమాటలునమ్మి యుధిష్ఠిరుడగ్నిప్రవేశము చేయబోవుట మొదలగు నూత్నకల్పనలు కలవు. సుయోధనుని వధించి తద్రక్తసిక్తమైన హస్తములతో ద్రౌపదివేణిని ముడిచికొప్పు పెట్టెద నని భీముడుచేసిన ప్రతిజ్ఞ సంపూర్ణ మగుటచే దీనికి వేణీసంహార మనుపేరు వచ్చినది. పాత్రలవ్యక్తిత్వమును సుస్పష్టరేఖలతో తీర్చిదిద్దుటయే ఈ నాటకమందలి ప్రధాన గుణము. ఇందలినాయకు డెవరో నిర్ణయించుటకు కవి ఏవియు ఆధారములు సూచించియుండలేదు. అందువలన ఏతద్గ్రంథమునందలి నాయకుడు భీముడా? లేక ధర్మరాజా? అనుసందేహములకవకాశ మిచ్చుచున్నది. కావున ఈ విషయమును వ. సు. రాయకవిగారి నాటక మాధారముగా పరిశీలించుటయే ఈ వ్యాసోద్దేశము.

'వేణీసంహార' మను దానికి వేణీసంబంధపురస్కృత శత్రుసంహార మని యర్థము చెప్పుచో ధర్మరాజు నాయకుడగును. వేణీసంహారమున కేశసంయమన మని యర్థము చెప్పుచో భీముడు నాయకుడగును. కాని కేశసంయమనార్థముఁ జెప్పు భీముచరిత్రము దానికి కారణభూత మగు ప్రాసంగికముగ గ్రహించి ధర్మరాజు నాయకత్వమును స్థాపించుటయుగలదు. ఇదియే యుత్తమము.

దశవిధరూపకములలో నాటక ప్రభేద మొకటి. దానికి ప్రసిద్ధి తెచ్చిన లక్షణములలో ధీరోదాత్త నాయకత్వ మొకటి. కావున నే ప్రాచీన నాటక కర్తలు అనుల్లంఘనీయము అగు వానిలో దీనినిగూడ జేర్చిరి. రసము నాయకత్వవివక్షకు ముఖ్యకారణ మగును వీర మంగియగుచో ధీరోదాత్తుడు నాయకుడు. రౌద్ర మంగియగుచో ధీరోద్ధతుడు నాయకుడు. భీముడు ధీరోద్ధతుడు. వీర మన్నవారిపట్ల ధర్మజుడు నాయకుడు. ఇతడు ధీరోదాత్తుడు.

స్థూలదృష్టితోఁజూచిన నీ నాటకమున భీముడే నాయకుడు. అతని చాపల్యము, సహంకారస్ఫోరకమగు అవికత్థనత్వము, దర్పభూయస్త్వము మొదలగునవి యీ విషయమునే ఋజువు చేయుచున్నవి. మరియు

"ఆ దురాత్మ' వృథామంగళ పాఠక! శైలూషాధమా!" అన్న భీముని వాక్యములతోనే నాటక ప్రారంభము జరుగుచున్నది. అంకము నాయకాసన్నము కావలయునన్న అంకలక్షణము ననుసరించి భీముడే ప్రతి అంకమున కన్పట్టును. ఈ నాటకమున ప్రతినాయకుడగు దుర్యోధనుని సంహరించినవాడు, సంధికి సమ్మతింపక ద్రౌపది నపవారించినవాడు,మీదు మిక్కిలి వేణీసంహార మహోత్సవమును గావించినవాడు భీముడు. "ప్రత్యక్షనేతృ చరితమ్"- అన్న నాటక లక్షణము వేణీసంహారమున భీమునకే అన్వయించుచున్నది. కావున వాయుపుత్రుడే నాయకుడు. ఇతడు ధీరోద్ధతుడు. రౌద్ర మంగిరసము. ఈ కారణముల నన్నిటిని మనమున నుంచికొనియే వేణీ సంహారాంధ్రీకరణకర్త యగు వ.సు.రాయకవి పీఠిక

...యందు భీమనాయకత్వమునే ధ్రువపఱిచి ...ట్టి క్రింది వాక్యములవలన స్పష్టమగుచున్నది.

"వేణీసంహార మను నీ నాటకము భారతము ననుసరించి భట్టనారాయణు డనుకవి గీర్వాణభాషయందు రచించినాడు. ఇది రౌద్రరస ప్రధానంబైనను శృంగారసాశ్రయంబని చెప్పదగి యున్నది. నేనికి కథానాయకుడు పార్థమధ్యముడు భీమసేనుడు".

ఈ ప్రకారము స్థూలదృష్టితో పరిశీలించి యీనాటకము నందలి అంగిరసము రౌద్రమనియు, నాయకుడు భీము డనియు, నిర్ణయించుట కేవల భ్రాంతిమూలము భట్టనారాయణు డిందు రౌద్రము నంగిరసముగ నుద్దేశించి పోషించియుండలేదు. సూక్ష్మపరిశీలనమువలన నీవిషయము స్పష్టము కాగలదు. స్థూలదృష్టితో పాఠకులు భ్రాంతి నొందుదు రనియెంచి, ...వియే వీరమాగి యనియు, నాయకుడు ధర్మజుడనియు కొన్ని సూచనలు గావించి యున్నాడు. వీరమైనను రౌద్రమైనను నాటకమున శత్రు నిర్మూలన మొనర్చిన నమసంబంధియే యగును. కాని కత్తిపట్టని ధర్మజనిష్ఠ మనుట యెట్లగునది కొందఱి ప్రశ్న.

యజ్ఞమున సర్వకార్యములను యజమానుడే నిర్వహింపడు. ఋత్విక్కులు, సుపద్రష్టమున్నగువా రాయజ్ఞకార్యనిర్వహణ మొనరింతురు. ఆయజ్ఞదీక్షను గైకొని యాజ్ఞికుడు కేవలము తటస్థుడుగానే యుండును అంతమాత్రమున యజ్ఞఫలము ఋత్విక్కులకును, ద్రష్టకు చెందదు. తత్ఫలమున కర్హుడు సోమయాజియే. కురుక్షేత్ర సంగ్రామయజ్ఞమునకు యాజి ధర్మజుడే. తత్ఫలమాతనికే చెందును. ఈవిషయము భీమునివలన నీ క్రింది పద్యముద్వారా వినుచున్నాము.

"విను ఋత్విక్కులమేము నల్వురము నా
వెన్నుం డుపద్రష్ట మా
యినుడే యాజియు, సోమిదమ్మ వగుది
వే; కౌరవుల్ తప్పకుల్
వనితా దుఃఖము నీగుశేషఫలము గా
వర్తిల్లు నయ్యధ్వరం
బునకున్ రాజులు నందఱం బిలువ గా
మ్రోగింతు రా దుందుభిన్"_

'నయత్యన్యాన్ భటా నితి నాయకః' యను వ్యుత్పత్త్యనుగుణముగ నాటకమున ఫలానుభవ మెవ్వరికి చెందునో ఆతడే నాయకుడగుట ప్రాచీనాలంకారిక సంప్రదాయము. పూర్వోక్తమైన విధమున ఫలానుభవము ధర్మజునకే సంక్రమించుచున్నది. కాన అతడే నాయకుడు.

ధర్మజుడే నాయకుడనుట నీక్రిందివద్యమింకను సుస్పష్టమునరించుచున్నది.

'మది సత్యవ్రత భంగసాధ్వసమునన్
మందీకృతం బయ్యెనె
య్యాగి, తాల్మిం గులకాంత గోరియొకచా
యన్ విస్మృతం బయ్యెనె
య్యాది ద్యూతారణి ద్రౌపదీవసనకే
శాకర్షణం బుట్టెనె
య్యాది, యాధిష్ఠిర మాత్రుధాగ్ని కురువ
న్యాసీను జృంభించెడున్".

కురువన్యాసీమజృంభించి దగ్ధమొనరించినది యాధిష్ఠిరాగ్నియే. భీమాదులు దానికుపకరణ మాత్రులే

నాటకమున నాయకుడు స్వయంపరిపూర్ణ ప్రజ్ఞావంతుడగుట తనయభిమతానుసారమే వర్తించును. కాని యితరుల యాజ్ఞానుబద్ధుడు కాడు. ఇది యతనిలో నౌత్కృష్ట్యసూచక మగు విషయము. భీముడు నాయకుడను పక్షమున నిది చెల్లదు. అతడు బీజాదినుండి నిర్వహణపర్యంత మగ్రజాజ్ఞానుసారమే ప్రవర్తించినాడు. "మీరు గారు గురుపుల్ తమ్ముండగానే" ననుభాషణము లితని క్రోధోద్వేగస్థాయిని సూచించునేకాని భ్రాతృతిరస్కారపూర్వకమగు నవిధేయతకు నిదర్శనములుకావు. కానిచో 'నిప్పుడే పట్టి వధియించియేను దుస్ససేనునొద్దకు నిను బంపలేనె, తులువ' యని దుర్యోధనుని పైకి దుమికిన యీపాండవ సింహము ప్రొద్దుతో రిపులుగ్రుంకు అరిసైన్యములన్ మరల్పుడీ' యనెడి. ఈభ్రాతాజ్ఞ చెవిని పడగనే పిల్లివలె మఱలుటకు సమాధానము లేకపోవలసి వచ్చును.

'ప్రత్యక్షనేతృచరితమ్'_ అన్న నాటకలక్షణమున అన్వయమువేరు. ప్రత్యక్షముగా నాయకుడే తత్కార్యనిర్వహణమున కుద్యోగింపవలసిన యావశ్యకత లేదు. తత్సంబంధీకు డెవ్వరైనను దోషము లేదు. సంబంధీకు డుపకరణమాత్రోపయోగియే. ధనుర్ధరహస్తమునుండి విముక్తమగు విశిఖము శత్రుభంజనము గావించినను, తచ్ఛక్తి ధనుర్ధరుని యధీనమే. అట్లే యీనాటకమున భీముడే ప్రతినాయకుడగు దుర్యోధనుని సంహరించి వేణీసంహార మొనర్చిన కార్యముల నెల్లను ధర్మజానుజ్ఞ వడసియే గావించెను. ఈ నాటకప్రధానాంగ మగు వేణీసంహార మహోత్సవమును గావించువపుడు సైతము భీముడు "దీనురాలైన ద్రౌపది వేణీసంహార మహోత్సవ మనుభవించుగాక", అన్న ధర్మజాజ్ఞను గ్రహించియే తత్ప్రతిజ్ఞానిర్వహణము సఫలము చేసికొనినాడు. కావున నాయకుడు యుధిష్ఠిరుడేయగుచున్నాడుగాని భీముడుగాడు.

ఇందంకములన్నియు, నాసన్న నాయకములు కావు కావున ధర్మజప్రవర్తనయు, తద్విజయసూచకవాక్యసరణియు నెటవ్యక్తీకరింపబడునో యాయంకములన్నియు నాసన్న నాయకము లనిభావించినచో, నీలక్షణమింపు పరిపుష్ట మగును.

"అవికత్థనః క్షమావా నతిగంభీరో
మహాసత్వః
స్థేయాన్నిగూఢమానో ధీరోదాత్తో
దృఢవ్రతః కథితః"

అను ధీరోదాత్తలక్షణమునకు ధర్మజుడు చాలవరకు తగియున్నాడు. ఇందుగల యవికత్థనత్వము, క్షమావత్త్వ, నిగూఢాభిమానము మొదలగునవి యాతనికి నైసర్గికములు.

చెప్పినప్పుడు అతడు 'I am clam ...s the pulse of the corpse, ...ని మౌని అయిపోతాడు. ఈ సుదీర్ఘ ...చనలో అతడు చూపిన ప్రేమతత్త్వం మైకోవ్‌కు, మరియాకు' సంబంధించినట్లు ...గాక, సంఘంవల్ల వ్యక్తికి జరిగే అన్యాయ ...ముంగా చిత్రిస్తూ వాపోతాడు. తన ...గ్న ప్రేమకు కారణమయిన దోపిడీ ...వ్యవస్థపై, 'కలం-కత్తి'ని దూసి నిలి...చాడు. విప్లవ కవిగా మారాడు. అందుకే మైకో 'Down with your ...ove' అని బాధతో చెప్పాడు.

మహాకవికి గల ముఖ్యలక్షణాలలో ...క్రాంతదర్శిత్వం' ఒకటి. అది మైకోలో ...సత్యం. అక్టోబరు విప్లవాన్ని ఆహ్వానిస్తూ ...Crowned with the thorns ...of revolt the year 1916 ...draws nigh' అని నిశితమైన పరిశీల...నతో అన్నాడు. కాని, మైకో అంచనా ...ఒక సంవత్సరం ముందయింది. 1917 లో అక్టోబరు విప్లవం విజయం సాధించింది. ఇది నా విప్లవం అని గుండె విరిచి చెప్పిన విప్లవకవి ఈతడు. అందుకే ఇప్పటికీ రష్యా ప్రజలు మైకో మాకవి' అని సగర్వంగా వెల్లడిస్తారు.

'విప్లవకవి' అనేవాడు రచనకే పరిమితుడు కాడు; అని 'మైకో' చెప్తూ అక్టోబరు విప్లవం తరువాత ఎన్నో సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. 'సినిమా, నాటకరంగ', సామాన్య ప్రజలలో చైతన్యం కల్గించే సాధనాలని గ్రహించి 12 Screen plays రచించాడు. వార్తాపత్రికలలో, మేగజైన్లలో అనేక సమస్యలపై వ్యాసాలు వ్రాసాడు. విప్లవదినాలలో పట్టణ ం తావరణాన్ని ప్రతిబింబించే 'Political Posters' రచించాడు. లెనిన్ మహాశయుడు విప్లవానంతరం 'New economic policy' ద్వారా రష్యాను సంపద్వంతం చేయువలచాడు. విప్లవానంతరం రష్యాను 'సమసమాజరష్యా'గా మార్పు చేయాలని అతడు తన ఆఖరి బహిరంగ ప్రసంగంలో వెల్లడించాడు. అందుకు తగిన జాతీయ కార్యక్రమాలన్ని మొదలయ్యాయి. ఈ సమయంలోనే మైకో 'It అనే రచన చేసాడు. ఇది కేవలం 'మైకో'కు సంబంధించిన భగ్నప్రేమ కథ. ఈ రచనలో తన ప్రేమ సఫలం కాకపోవడానికి కారణం అప్పటి 'వ్యవస్థ', అని నొక్కి చెప్పాడు. కనుకనే 'Down with your system' అని కేక వేశాడు. పైరచన చేయడానికి 'మైకో' సుమారు 50 రోజులు తన గదిలో పూర్తిగా ఉండిపోయాడు. ఎవర్నీ రానిచ్చేవాడు కాడు. తన మేధనంతను కేంద్రీకరించి 'It' అనే రచన పూర్తి అయ్యాక 1923 ఫిబ్రవరిలో బయటకువచ్చాడు. తన జీవితాన్ని సాహిత్యాన్ని 'ప్రేమ' ఎంతగా ప్రభావితం చేసిందో ఈ రచనలో పూర్తిగా చెప్పాడు. తను చెప్పింది తనకు సంబంధించిందే కాదని, అందరికీ సంబంధించిందని, అంటాడు. 'Love is the heart of everything, If it stops working, all the rest dies of, becomes superfloous unnecessary' ప్రేమ నుండి తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదని వివరించాడు. ప్రేమతత్త్వంలో మైకో మహాకవి లక్షణాలన్ని ప్రదర్శించాడు, తన ప్రేమ భగ్నం కావడానికి కారణమైన మౌలిక అంశాలైన చర్చి, సంప్రదాయాలు, సంస్కృతి. రాజకీయం, నైతికసూత్రాలు మున్నగు వాటిలో కుళ్ళుచున్న బూర్జువా వ్యవస్థపై తిరుగుబాటును ప్రదర్శించి, ముందు తరాలకు తనలాంటి నికృష్టదశ పట్టకుండా చేశాడు. కాని 'దేవదాసు' వలె త్రాగుబోతు కాలేదు. అందుకే అతడు మహాకవి అయ్యాడు. అటువంటి ఆలోచనా విధానాన్ని ఇచ్చిన 'మార్క్సిజానికి' ధన్యవాదా లర్పించాడు. (సశేషం)

# సాహిత్యంలో హేమంతం

— శ్రీ కరివరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

'కమనీయం కావ్యం' వర్ణింపఁదగినది కావ్య మని అభినవ గుప్తుడు. 'కవయతీతి కవిః తస్యకర్మ కావ్యం' వర్ణించువాఁడు కవి. అతని కర్మ కావ్య మని విద్యాధరుఁడు 'లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మ కావ్యం' అని మమ్మటుఁడు కావ్యమును నిర్వచించెను. కావ్య నిర్వచన మటుండ వీనిని బట్టి కవి ప్రధాన కర్తవ్యము వర్ణన మని తెలియుచున్నది. వర్ణనలు కావ్య సౌధాంగణమున తీర్చిదిద్దిన రంగవల్లులు. కవి ప్రతిభకు నికషోపలములు. దండి కావ్య దర్శనమున' (1. 16-13 శ్లో) కావ్యము అష్టాదశవర్ణనాయుతమై యుండవలె నని నిర్దేశించినాఁడు. దీనిలో 'ఋతువర్ణన' మొకటి. నాయికానాయకులు రసోద్దీపనము పొందుటకు చంద్ర నదీనద నగర 'ఋతు' సముద్ర మలయ మారుతాదు లత్యం తావశ్యకములు. వీనిలో ఋతు వర్ణనము సాహిత్యమునకు విశిష్ట సౌందర్య సంధాయకము.

అది మధ్యాంత రహితుఁ డగు విరాట్పురుషుని కాలపురుషునిగ పరిగణింపవచ్చును. 'అహమేవాక్షయః కాలః' అని గీతా ప్రవచనము. 'సంవత్సరో వై ప్రజాపతి స్తస్యాయనే దక్షిణం చోత్తరంచ' 'మాసో వై 'ప్రజాపతిః' అహోరాత్రే వై ప్రజాపతిః...' అని ప్రశ్నోపనిషత్తు ఈ కాల పురుషుని అంగములే ఋతువులు. దృశ్యమాన జగత్తునందలి చైతన్యమునకును, పరివర్తన శీలమగు ప్రకృతి విలాసము

# రష్యా విప్లవకవి మైకోవిస్కీ

— శ్రీ ఇ. టి. లోకనాథరావు.

**Downwith your love,
Downwith your art,
Downwith your system,
Downwith your religion**

పైనాలుగంశాలు బూర్జువా వ్యవస్థలో మనిషిని దోచుకు తింటాయని రష్యన్ మహాకవి మైకోవిస్కీ చెప్పాడు.

జార్జియన్ సంబంధమైన 'బాగ్దడి'లో ఈ మహాకవి తన బాల్యాన్ని గడిపాడు. ఈకవి తండ్రి ఫారెస్టరు. 'సవరల' వలె ఈ జార్జియన్ కొండప్రజలు కూడా వారి భాషలో మాట్లాడే వారితో ఎంతో సన్నిహితులై పోతారు. మైకోవిస్కీ తండ్రికి వారి ప్రాంతీయభాష వచ్చు. అందుకే అప్పుడైనాడు ఆకొండ ప్రజలకు. 'మైకో' చిన్నతనంలో కొండపిల్లల్తో ఆడుకుంటూ వారిభాషను చక్కగా గ్రహించాడు. ఈ 'జార్జియన్' భాష విప్లవదినాల్లో తనకెంతో సహాకరించిందని మైకో అంటాడు. 1906 లో మైకో తండ్రి ఆకస్మికంగా చనిపోవడం వల్ల, కుటుంబమంతా 'మాస్కో'లో ఉన్న పెద్దక్క వద్దకు తరలి వెళ్ళవలసివచ్చింది. 'మైకో'ని కవిగా తీర్చదిద్దడంలో మాస్కో పట్టణపు వాతావరణం ఎంతగానో ప్రేరణచేసిందని అతనే చెప్తున్నాడు. 'Russia was dream of my life' మాస్కో ప్రాథమికోన్నత పాఠశాలలో ప్రవేశము, సోషల్ - డెమొక్రటిక్ పార్టీలో సభ్యత్వం రెండూ ఒకసారి జరిగాయి. ఎన్నో విప్లవకర సంఘటనల్లో పాల్గొనడం వల్ల మూడుసార్లు జైలు శిక్ష అనుభవించాడు. మూడోసారి వేసిన పదకొండు నెలల జైలుశిక్షాకాలంలో (1907-09) మధ్యకాలంలో మైకో తన్ను ప్రభావితం చేసిన అంశాలతో సహా తన జీవితచరిత్రను సంక్షిప్తంగా రాసాడు. కొండప్రాంతంలో పుట్టుక; కొండప్రజలతో గడిపిన బాల్యం; మాస్కోలోగల విప్లవకరపరిస్థితులు; మైకో సాహిత్యంలో పూర్తిగా చోటు చేసుకున్నాయి.

సెల్ నెం. 103 లో ఉంటున్న దినాల్లో వివిధ సాహిత్యప్రక్రియల్ని, కవుల్ని అధ్యయనం చేసాడు. విప్లవకళాకారుడుగా మారి, 'సమసమాజకవనం' అభివృద్ధిచేయడమే తన జీవిత పరమార్థమనే నిర్ణయానికి జైల్లోనేవచ్చాడు.

జైలునుండి విడుదల కాగానే మైకో అనేక కళాకారులను, కవులను కలుసుకున్నాడు. మొదట్లో అటువంటిసంఘాల్తో మెలగడం కాస్త క్రొత్తగా ఉన్నా సర్దుకుపోయాడు. చిత్రకళాకారుడుగ అవుదామనుకొన్న మైకో కవిగా మారడానికి తగిన వాతావరణం కల్పింపబడింది. ఆ సమయంలోనే మైకోకు 'ఫ్యూచరిష్టు'లతో పరిచయం ఏర్పడింది ఆరోజుల్లో 'బూర్జువా' వ్యవస్థపై తిరుగుబాటు ధోరణికలవర్గంగా ప్రఖ్యాతిగాంచినారు; కాని వర్గసమరంపై వారికి నమ్మకంలేదు. ఫ్యూచరిష్టులు 'మైకో సాహితీ ప్రక్రియలకు, పూర్తి మార్గదర్శకులు కాకపోయినప్పటికి, వారు ఉద్బోధన చేసిన 'నిహిలిజమ్' మాత్రం మైకో సాహిత్యంలో విప్లవధోరణిని, బూర్జువా సాహిత్యాన్ని భౌతికపరంగా ఆలోచించి విశ్లేషించడానికి తగిన చేయూతను, మెదడుకు మేతను ఇచ్చింది. దానిని గ్రహించి 'మైకో' తన సొంత ఆలోచనా ధోరణితో సరిక్రొత్త బాటను నిర్మించుకున్నాడు.

'రష్యావిప్లవం' మైకోను తట్టింది. దాంతో మైకోలో కనువిప్పుకల్గి, నివురుగప్పిన నిప్పయ్యాడు. క్రాంత దర్శియై 'విప్లవవిజయాన్ని' గిరిగీసి చూపించగల్గాడు. తాను రాసిన 'Clouds in pants' సుదీర్ఘరచనను, పెట్రోగ్రాడులో ఉన్న 'గోర్కీ' మహాకవి ముందు చదివి వినిపించాడు. ఆ రచనతో 'గోర్కీ' ముగ్ధుడై 'Russia is in need of a great poet both Democratic and Romant' అని అన్నాడు. మైకో రచనల్లో ఇది గొప్ప విప్లవపూరితమైన ధ్వని సమన్వితమైన రచన. మరియు స్వీయచరిత్ర మిళితమైన 'విప్లవ-కాల్పనిక' రచన ఇది.

'Clouds in pants' అనే సుదీర్ఘ రచనలో మైకో ఎలాగున బూర్జువాసంస్కృతి, చర్చి, సంప్రదాయం, తన నిండుప్రేమను భగ్నం చేసాయో చెప్తాడు. తాను గాఢంగా ప్రేమించిన 'మరియా' అనే అమ్మాయి, 'You know, I am getting married, అని స్వయంగా వచ్చి

---

( 2 వ పేజీ తరువాయి )

నాటకమున ఫలానుభవ మెవ్వరికి చెందునో యాతడే నాయకుడు. భగవానుడగు శ్రీకృష్ణుడే యుధిష్ఠిరునితో "నకుల సహదేవ ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖ సేనానాయకులు... వారికలశులయి, మీయభిషేకమును గోరుచున్నా" రని తెలుపుటలో ఫలము ధర్మజునకే చెందుచున్న దని తేటతెల్లమగుచున్నది.

నాటకాంతమున భరత వాక్యమును పల్కు నాతడు నాయకు డగుట సంస్కృత నాటక సంప్రదాయము. ఇందు ధర్మజుడే భరత వాక్యమును పఠించె గావున నాతడె నాయకుఁ డనుట సంప్రదాయసిద్ధము.

పైచర్చయాధారముగా వేణీసంహార నాటకమున ధర్మజుడే నాయకుడనుట సమంజసమగనున్నది. *

లకను ఋతువులే హేతు భూతములు. కాలచక్ర పరిభ్రమణమున ఋతుపరిణామము ప్రవర్తిల్లుచుండును. అనంత కాల చక్రమున వ్యవహార సౌలభ్యము కొఱకు సంవత్సరము నొక ప్రమాణముగ దీసికొన్నచో ప్రతి సంవత్సరమున ఆఱు ఋతువులు క్రమ పరిణామ ప్రాప్తము లగుచున్నవి. వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువు లవి. స్థావర జంగమాత్మక మగు నీ జగత్తంతయు నీ షడృతు లీలా హేలా భాసురమే. ఒక్కొక్క ఋతువునకు ప్రకృతి ఒక విధమయిన విశ్వరూప ప్రదర్శనము చేయును. ప్రకృతము ఆంధ్ర సాహిత్యనందనోద్యానవనమున ప్రతిఫలించిన హేమంత శ్రీని పరిశీలింతము.

'హిమేన హంతీతి హేమంతః' అని హేమంత శబ్దవ్యుత్పత్తి అనఁగా చలిచేత జనులను హింసించునది అని అర్థము. మార్గశిర, పుష్య మాసాలు (డిసెంబరు, జనవరి) హేమంతఋతువు. మంచుకురియు చుండుటయు, తదభావము నందైనను చల్లగా నుండుటయు ఈ ఋతు స్వభావము. వసంతం ప్రేయసీప్రియుల కెంత ప్రియతమమో, హేమంతము కాముకుల కంత ప్రియతమము. ఎల్లరు చలి బాధనుండి నివారణ పొందుటకు ప్రయత్నింతురు. ముదుకదుప్పట్లలో ముసుగుతన్ని పగుండువారు, ఎండకు ఎదురు చూచెడివారు, చలిమంటల కాగువారు, ఎల్లెడల కన్పట్టుదురు. జీవకోటిని చలిపెట్టు ఇక్కట్టులను తలచి గొన్న నవ్వుపుట్టును. హేమంత సీమంతిని బంతి పూవులు, చేమంతులు కై చేసికొని విహరించును. తామరలు ఈ ఋతువున నశించును. 'హేమంతే దినలఘుతా, శీత, యవ, స్తంబ, మరు, బక, హిమాసు' హేమంతమున పగటి ప్రొద్దు తక్కువ. రాత్రి ఎక్కువ. ఈ హేమంతమున సంక్రాంతి సంబరములు గమనార్హములు. సాతాని జియ్యరు కోడికూతతో మేల్కొని తిరుమార్ణము దిద్ది, చిఱుతలు, తంబురమీటుచు హరిలో రంగ హరీ' యనుచు పాటలు పాడుట ప్రతి పల్లెయందును కన్పట్టును. క్రొత్త పెండ్లి కూతుళ్ళు వీథులలో కళ్లాపి చల్లి రంగారుబంగారు రంగవల్లికలతో నలంకరించి గొబ్బెళ్ళు పెట్టుచు పాటలు పాడుదురు. కోడిపందెముల కోలాహలము, గంగిరెద్దుల సంరంభము ముచ్చట గొలుపును. వరికంకుల తోరణాలు, సిరికంకుల పారాణులతో ప్రతి గృహము పచ్చగా నుండును. ఇవి హేమంత ఋతులక్షణములు.

హేమంతమునకు ఇంకొక ప్రత్యేకత కలదు. హేమంతానంతర ఋతు వగు శిశిరమును హేమంత ఋతులక్షణములు కొన్ని కలిగి యుండుటవలన; దానిని హేమంతములోనే అంతర్లీనముచేసి 'పంచారేచక్రేపరివర్తమానే' అనిఐదుఋతువులనే లెక్కించుటయు కన్పట్టును. 'హేమంతావధి సంప్రబోధ గురువుల్ హ్యజ్ఞాత తేజోగ్ని ధా, య్యామంత్రాక్షరముల్ పటీరగిరి వన్యామంద వాతూలముల్, హేమాలుం గలశీ తనూభవ వధూవేణీ భరాంతః ప్రసూ, నామోద గ్రహయాళువుల్ పొలసె దక్షారామమధ్యంబునన్' అని శ్రీనాథుఁడు వసంత ఋతు సౌభాగ్యమును వర్ణించుపట్టుల హేమంత శిశిరములను కలిపి వర్ణించినాఁడు. ఐనను సమాన లక్షణముల కన్నను భిన్న లక్షణములే అధికముగ నుండుటవలన వీనిని వేర్వేఱుగనే పరిగణించుట యుచితము.

ఆంధ్ర సాహితీలత సంస్కృత సాహిత్యపుపాదు నుండి బాహిరిల్లినది కనుక ఇంచుక సంస్కృత సాహిత్యమందలి హేమంత ఋతువర్ణన నరయుదము. ఆది కావ్య మగు రామాయణమున వాల్మీకి హేమంతమును విపులముగ వర్ణించెను. (అరణ్యకాండ. 16స. 1,4 to 26 శ్లో).

'శరద్వ్యపాయే హేమంత
ఋతు రిష్టః ప్రవర్తతే'

శరదృతువు గడచి యిష్టమైన హేమంత ఋతువు ప్రవేశించిన దట. ఇంకను హేమంతమును గుఱించి లక్ష్మణుఁడు రామునితో నిట్లు పలికెను.

'అయం సకాల సంప్రాప్తః
ప్రియో యస్తే ప్రియంవద
అలంకృత ఇవాభాతి
యేన సంవత్సర శ్శుభః.'

—'ఓ రామా! ఏది నీకు మిక్కిలి ప్రియమో, దేనిచే సంవత్సరమునకంతకు నలంకారము గలుగునో అట్టి హేమంతర్తువు వచ్చినది" అని భావము. అప్పటికింకా శ్రీరామునకు సీతావియోగము ప్రాప్తించలేదు. అందుకే శ్రీరామునకు హేమంతము ప్రీతిపాత్రమనుచున్నాఁడు లక్ష్మణుఁడు. పై శ్లోకమందలి 'ఇష్ట' శబ్దమును ఇట్టిదే. మఱియు ప్రకృతిని వర్ణించుటయేకాక, ప్రకృతికిని పాత్రలకును తాదాత్మ్యమును తాపించుట గమనార్హము.

'జ్యోత్స్నా తుషార మలినా
వార్ష్య మాస్యాం న రాజతే
సీతేవ చాతప శ్యామా
లక్ష్యతే న తు శోభతే'

—'పున్నమనాడు గూడ వెన్నెల తుషార మలిన మగుటచే కాంతితగ్గి యెండతాకుడుకు నల్లనయిన దేహముగల సీతాదేవి వలెం బోలియున్నది. ఎంతమాత్రము ప్రకాశము లేదు'— అని భావము. 'అపృథగ్ యత్న నిర్వర్త్యః సోఽలంకార రసేమతః' అని ధ్వన్యాలోకకర్త చెప్పినటుల ఇట్టి అప్రయత్న సాధ్యములగు సహజవర్ణనలు కథానుక్రమములో అంతర్లీనమై వస్తుసాక్షాత్కార మొనర్చుటలోను, రసప్రసన్న మగుటకును సమర్థము లగును. కాగా వాల్మీకి వర్ణనలో ఇంకొక విశేషము కలదు. 'ఇష్ట' 'ప్రియో యస్తే ప్రియంవద' అన్న విశేష్య ఇంత విపులవర్ణనలోను శృంగారస్పర్శగల పదములు లేవు. ఆతని వర్ణన ఆర్ష ప్రకృతికి అద్దము పట్టినది. మిగిలిన కవులెల్లరు ఈ ఋతువర్ణనలో శృంగారమును ఆపోసన పట్టినవారే. కొన్నిపట్టుల ఔచిత్యపు పొలిమేరలను దాటిన వారును లేకపోలేదు.

వ్యాసుడు హేమంతమును వర్ణింపలేదు కాని స్పృశించి విడిచెను.

'హేమంతే ప్రథమే మాసి నందవ్రజ
కుమారికాః
చేరు ర్హవిష్యం భుంజానాః
కాత్యాయన్యర్చనవ్రతమ్'

హేమంతఋతువు నందలి ప్రథను మాసమున (మార్గశిర మున) నందవ్రజకన్యకలు కాత్యాయనీ వ్రతము చేయనారంభించిరట. ఇట్లే కిరాతార్జునీయము, శిశుపాలవధ, మధురావిజయము, రఘువంశము మున్నగు కావ్యములలో హేమంతము వర్ణితము. భానుడను కవి హేమంతమును ఒక చాటువులో చక్కగా వర్ణించెను.

'అమ్బర మేష రమన్యై
యామిన్యై వాసరః ప్రేయాన్
అధికం దదౌ నిజాంగా
దధ సంకుచిత స్స్వయం తస్థౌ!'

పగలను నొక పురుషుడు తన భార్యయగు రాత్రికి, ఆకాశ మను దుప్పటిలో అధిక భాగమును కప్పుకొన నిచ్చెను. మిగిలిన భాగమునం దే తన శరీరమును ముడుచుకొనుటకు చేసిన ప్రయత్నము వలన పగలు కుంచించుకుపోయినది. రాత్రి వ్యాకోచించుకొనియున్నది-అని భావము. దీనివలన హేమంతమున పగలు, రాత్రి కూడ చలి అధిక మని; పగటికాలము తక్కువని, రాత్రికాలము ఎక్కువని విశదమగుచున్నది. హేమంత స్వభావమును కవి రమణీయముగు కల్పనతో కప్పినాడు.

ఇక కవికుల గురువు కాళిదాసు.ఆయన 'ఋతుసంహారము' ప్రకృతి కాంతకు మేలిక్కైసేత.'ప్రకృతికిన్ భావ్యప్రణేతల్ కవుల్' అను దానిని సార్థకము చేసినవాడు కాళిదాసు. ఋతుసంహారమున హేమంతము శ్లోకములలో వర్ణితము. అందు ప్రథమశ్లోకము వినా మిగిలిన వన్నియు శృంగారరసపూర్ణములే. సహజముగా కామోద్దీపకమైన హేమంతమును వర్ణించుటలో శృంగారమునకు ప్రాధాన్యమిచ్చుటలో అనౌచిత్యము లేదు. కాళిదాస వర్ణనలో ఎచ్చటను అసభ్యతగాని అశ్లీలముగాని లేకపోవుట విశేషము.

'పీనస్తనోరః స్థలభాగశోభా
మాసాద్య తత్పీడన జాతఖేదః
తృణాగ్రలగ్నై స్తుహినైః పతద్భి
రాక్రన్దతీ వోషసి శీతకాలః'

ప్రాతఃకాలమున మంచుబిందువులు పడియవి గడ్డికొనలందు జేరి రాలుటకు సిద్ధముగా నుండును. ఆ బిందువులజూచిన పీన స్తనశోభితము లగు సుందరీమణుల వక్షోభాగంబుల నందిన యీ శీతకాల మచ్చట నలుగుడుచెంది యా ఖేదమున నేడ్చుచున్నదా? యనున ట్లున్నది. ఉత్ప్రేక్షోల్లసితమగు ఈ భావము కాళిదాసు అచుంబిత భావనాపటిమకు నిదర్శనము. అనంతకాలపు సంస్కృతాంధ్ర కావ్యములందలి ఋతువర్ణనలకు ప్రత్యక్షముగనో, పరోక్షముగనో, కాళిదాస కృతి 'ఒజ్జబంతి' యైనదనుట సత్యదూరము కాదు.

కాగా ఆంధ్ర సాహిత్యమున హేమంతు ఋతువర్ణన మొనర్చిన ప్రథమకవి నన్నెచోడుడు. 'కుమార సంభవము'న (1-122, 123) పార్వతీ తపశ్చర్యయందు హేమంత శ్రీ వర్ణితము.

'శరదాగమమునదనసుత
కురు పరితాపంబు సేయుచుండుట
హిమ భూ
ధర పతి గని వానిపయిం
బరగొనియెనో నాగదుహిన
పటలము పర్వెన్' (6-123)

తప మొనరించెడి తన పుత్రికయగు పార్వతికి శరత్కాల శోభ పరితాపము కలుగ జేసినదని ప్రతీకారము చేయుటెంచి హిమవంతుడు ఉగ్రుడై మాచెనా యనునట్లు హిమ మెల్లెడల గ్రమ్మెనని స్వభావోక్తి రమ్యముగ వర్ణించినాడు కవిరాజశిఖామణి. అంతేకాక హేమంతము 'సంతతోపచిత మారవికారమున దేశములందు బర్వినదట'. సీతుబాధ కోర్వజాలక పాములు బొరియలలో దాగుకొని నటులు, నాగరికులు భూగృహవాసులై బయటికి రాకయుండిరట.

'రంగనాథరామాయణమున' వాల్మీకి ననుసరించి గోనబుద్ధారెడ్డి హేమంతవర్ణన మొనర్చెను.(అర. కాం. 233 to 266) అందును స్వకపోల కల్పిత ప్రతిభ లేకపోలేదు.

'మంచున జారు తామరల కన్నీరు
ముంచిన విరహుల మోములగేరు
పొదిగొన్న యకరువుల్ పొట్టుగా
మీదగ
గదలు తేటులు పొగల్గా చలిగొన్న
కొలను దేవతలకు గుంపట్లబోలె
విలసిల్లు కెందమ్మి విరుల జూచితివె'

జలరూపిణి యగు కొలను దేవతకే యంతటి చలియున్నచో మిగిలిన వారిమాట చెప్పనేల! చలి ఔద్ధత్యమును చక్కగా నిరూపించినాడు బుద్ధారెడ్డి.

'నృసింహపురాణము'న ఎఱ్ఱన హిరణ్యకశిపు తపోవర్ణనమున హేమంతఋతు వర్ణన మొనర్చెను. (2ఆ.19,21) హిరణ్యకశిపునకు ప్రకృతికిని తాదాత్మ్యము ఘటింపబడినది.

'దనుజఘోరతపోగ్రతపుదలంకినమాడ్కి
గమలిన నెత్తమ్మి కన్నుమూయ
వ్రతము వేడిమి వెమ్మ దితిజు మేనికి నోడు
క్రమమున గడలు దీగమున కొగుగ
నసుర వెచ్చని యూర్పులడరగనింకకు
నీటితూరక మంచుసీరు గురియ
జలదేవతలు దైత్యు కలితనం బగ్గించు
చెలువున సారసోత్కులం చెలంగ
దివిజవైరి తపము తెలగెల్ల గంటికి
నిదురలేక చూచునదియు బోలె
వికచకుముద నేత్ర విభవయై రేలజె
న్నొందె దానవేంద్రు డున్న సరసి'
(2-21)

# కద్రూ వినతల ఘట్టము - కొన్ని ప్రసన్న విశేషాలు

- భాషాప్రవీణ శ్రీ మైలవరపు శ్రీనివాసరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

నన్నయ చాలాచోట్ల విశేషణాలని వ్యర్థంగా వాడఁడు. కద్రువ, వినత కలిసి మర్నాడు చూసిన ఉచ్చైశ్శ్రవాన్ని 'తురంగము - జాతిప్రయుక్తవిశేషణము' adjective of analıty-speed going horse) అన్నాడు. 'తురంగచ్ఛతీతి తురగః'అని విగ్రహము. వేగముగా వెళ్ళేది అని. మిగతా అన్నిచోటులా హయమూ-హయరత్నమూ- అశ్వమూఅని ఇక్కడ ఇలా అనడానికి కారణం ఒకటుంది. కర్కోటకుఁ డనే పాము తన తోకమీఁద వేలాడుతున్నాడు. వినతకి, ఆగుఱ్ఱంతోకమీఁద వేలాడేది పాము అని తెలియదుగానీ గుఱ్ఱానికి తెలుసు ఏదో తనతోకమీఁద ఉందని. ఆ కర్కోటకుఁడు కూడ శాపానుభవభీతచిత్తుఁడు. ఇప్పుడు చేయవలసినపనికూడా సరిగా చేయకపోతే మరోశాపం ఇస్తుం దని భయంకూడా ఉండవచ్చు. అందుకే కర్కోటకుఁడు వీలయినంత త్వరగా, వినత చూసీ చూడకుండా పూర్తిగా తెల్లగాఉందనే నమ్మిక తోఁచేలా ఆ గుఱ్ఱాన్ని ఆక్రమించి కదిలేలా చేశాడు. అందుకే అది తురగంఅయింది. శాపఫలం ఎవరికైనా అనుభవింపక తీఱదు. నిజానికి వినతకి శాపం తాను గ్రుడ్డుని పగలగొట్టినందు కిచ్చినట్లుంది. ప్రతిశాపంకూడా ఏదో ఒకమంచికే ఇవ్వబడుతున్నట్లు (రాబోయే కాలంలో పదిమంది శ్రేయస్సుకే) అన్పిస్తుంది. ఈ శాపంవలన వినత మఱింత జాగ్రత్తగా ఉండడం, గరుత్మంతుఁడు పుట్టడం, అమృతం తేవడం జరిగింది. సర్పయాగం వలన పాములు నశించడం, వాసుకి శేషాదులు సర్వభూతాధారమైన విష్ణువుని, భూమిని మోయడంవంటి ఉత్తమ కృత్యాలలో ఉండడమూ జరిగింది. కద్రువకి పరోక్షంగా గర్వభంగం అయింది లేనిపోని ఈర్ష్యతో తనపుత్రులనందఱనూ చంపుకోవడం ఏమంత తెలివి? ఇది ఓరకంగా ఉపదేశాన్నిస్తుంది. తాను కోపోద్దీపితముఖియై శపించింది. 'తనకోపమె తన శత్రువు' అంటే ఇదే. కథ చివరివరకూ చూస్తే అధర్మం నశిస్తుంది. ధర్మం జయిస్తుంది. అదేకదా ఉత్తమోపదేశము.

ఆ రోజుల్లో దాసీత్వం అంటే చాలా అధికారం చెలాయించఁబడే - హీనంగా చూడబడే స్థితి. ఈనాఁడూ లేకపోలేదు గాని ఆరోజులంత కాదు. ఈదాసీత్వం అనేది శర్మిష్ఠ-దేవయాని కలహంలో కూడా కన్పడుతోంది. "కన్యకాసహస్రయుతయై నాకు శర్మిష్ఠ దాసియగుఁ గాక!" అని దేవయాని కోరడం ఇందుకు సాక్ష్యం. సరే ఇలా కద్రువకి దాసిగా ఉండి పనులు చేస్తూండగా రెండవగ్రుడ్డు దానంతట అది పగిలిం దట. ఆపద్యం ఇది -

"ఆతత పక్షమారుత ర
య ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాత మహార్ణవుండు బల
వన్నిజదేహ సముజ్జ్వల ప్రభా
ధూతపతంగ తేజుఁ డుది
తుం డయి తార్క్ష్యుఁడు తల్లికిన్మనః
ప్రీతియొనర్చుచు న్నెగసె
భీమజవంబున నభ్రవీథికిన్."

ఈరెండవగ్రుడ్డు పగిలినప్పుడు చెప్పిన పద్యానికీ - మొదటిగ్రుడ్డు తాను పగులగొట్టిన పద్యానికీ పోలికలున్నాయి. మొదటిపద్యం ఇది -

"దాన నపరార్థకాయ వి
హీనుఁడు పూర్వార్థతను స
హితుఁ డరుణుఁ డనం
గా నుదయించెను సుతుఁడు మ
హా నీతియుతుండు దల్లి
కప్రియ మెసఁగన్.

ఇట్లు వికలాంగుఁడై పుట్టిన యనూరుండు ..సూర్యరథసూతుండై యరిగె"-

1. తల్లి కప్రియ మెసఁగన్
   పుట్టినవాఁడు అనూరుఁడు
   తల్లికిన్ మనఃప్రీతి యొనర్చున్...
   ఉన్నవాఁడు గరుడుఁడు
2. ఉదయించెను సుతుఁడు(అనూరుఁడు)
   ఉదితుం డయి తార్క్ష్యుఁడు
   (గరుడుఁడు)

ఈ క్రియాపదాల వాడుకలోకూడా భిన్నత గోచరిస్తుంది.

3. మహానీతియుతుండు-అయినా
   అనూరుఁడు అప్రియాన్ని చేస్తాడు.

(విశేషణాలు గుణానికి సంబంధించినవి లేవు) అయినా ప్రియాన్ని చేస్తున్నాడు గరుడుఁడు.

4. సూర్యరథ సూతుండై
   యరిగె (అనూరుఁడు)
   భీమజవంబున నభ్రవీథి
   కెగిరినాఁడు. (గరుడుఁడు)

( 6 వ పేజీ తరువాయి )

హేమంతఋతువున కమలములు నశించును. దానికి తపోనిష్ఠలో కన్నులు మూసికొనిన దైత్యుని గాంచి కమలము కన్నుమూసిన దని కవి కల్పన. హేమంతఋతు కథాగతవర్ణనలో అంతర్లీనము చేసిన కవి ప్రతిభ మహోదాత్తము.

(సశేషం)

ఇలా ఇద్దరికీ పుట్టడంలో - స్వరూప భావాల్లో ఉన్న అస్పష్టమైన పోలికలని బాగా చిత్రించి చూపాడు. చిత్రకళ కూడా ఒక లలితకళే అయినా కవిత్వమంత ఉత్తమంకాకపోవడంతో ఉత్తమ కళ అనలేకపోతున్నాం. అందుకే లలిత కళల్లోని చిత్ర-శిల్ప-నృత్య-సంగీతాదులన్నీ కవిత్వంలో ఉంటున్నాయి

ఉదాహరణలు కోకొల్లలు. అనూరుడు పుట్టినప్పటి పద్యంలో తల్లికప్రియమెసఁగన్ అనేచోట నామిత్రులొకరు తల్లిక (తల్లికిన్+అ = తల్లిక = తల్లికే) ప్రియమెసఁగన్ అని విడిచి ఒక సౌందర్యాన్ని కస్పరిచారు. ఆ వికలాంగత్వాన్ని చూసి అప్రియంపడినా-ఏతల్లికి ఏపుత్రుఁడంటే ఇష్టం ఉండదు ? అయితే ఇక్కడ వినతకే ప్రియంకల్గించే కొడుకు అనడంలో విశేషం ఏమంటే, ఎవడైనాసరే-అసలు పుత్రుఁడు పుట్టడం అంటేనే గిట్టని కద్రువకీ - తత్సఖులకీ, ఇది అప్రియంకాదా? అని. నాకైతే ఇది బాగానే ఉంది. సహృదయులాలో చింతురుగాక !

మహానీతియుతుఁడైనవాఁడు తల్లికి ప్రియాన్ని చేయాలిగానీ, అప్రియాన్ని ఎందుకు చేశాడు ? అనిపించడంసహజం. వినత ఒకతీరు మత్సరభావానికీ, అహంకారానికీ లోనై గ్రుడ్డుని అధర్మంగా చిదిపింది. తదనుగుణంగా కర్మఫలాన్ని ఆమె అనుభవించవలసిఉంది. కాబట్టే వినత శాపగ్రస్తురాలైంది. వినత చేసింది అవినీతియైనపని అని అనూరుఁడేఅన్నాఁడు "నన్ను సంపూర్ణశరీరుంగానీక యండం బవియించిన అవినీతవు గావున ." అని సంపూర్ణ శరీరుణ్ణిగా అనూరుణ్ణిచేస్తే అతడప్పుడు కాళ్ళతో పనిలేని సూర్యరథసూతుఁడు గా నక్కరలేకుండా మరేదో యింతకంటే ప్రజోపయోగంచేసి ఉండేవాఁడు. తల్లివద్దనే ఉండేవాఁడు. దాసీత్వం తనతల్లికి తెచ్చేవాఁడు కాడేమో. ధర్మాన్ని జయించేలా చేసి అధర్మాన్ని తుదముట్ట నాశనం జేసేవాఁడేమో! ఇన్ని అర్థాలు ఇలా ఊహించుకొంటూ వెడుతూంటే సంతోష ఘంటాపథంలో స్పష్టంగా గోచరిస్తాయి. అతఁడు (వైనతేయుఁడైన అనూరుఁడు) నీతియుతుఁడే కాక మహానీతియుతుఁడు కాబట్టి తల్లి- అని ఐనా వెనుదీయక ఘోరశాపాన్ని ఇచ్చాడు ఈ శాపంలో ఒకచక్కని ధర్మోపదేశంఉంగి. ఎవరియెడ తను మత్సరభావాన్ని వహించి గ్రుడ్డుని చితిపిందో వారికే దాసి కమ్మని శపించాడనూరుఁడు.ఒకరియెడఉండే మత్సరాన్ని సహించాలీ అంటే వారియెడ ప్రేమకలిగి ఉండాలి. ఇది చాలా అనూహ్యం ఐన విషయం. ఊహాలోనే భరించలేని విషయం. కానీ నిజంగా అహంకారం నశించాలీ అంటే మార్గాంతరం లేదు. పైగా తనలోని అహంకారం నశించడం తనకే ఉత్తమ లోకాలు ప్రాప్తించడానికి మార్గం. ఇది తెలిసినా అహంకారపూరితమైన పట్టుదలతో ఎవరు-తమ కయిష్టులైన వారివద్ద ఊడిగానికి ఒడబడతారు ? అందుచేతే అనూరుఁడు దాసివికమ్మని శాపాన్నిచ్చాడు. అంతేకాని 500ఏండ్లు దాసిగా ఉంటే ఈదోషం తొలగుతుంది అనలేదు. అలానే అవకాశం (Exemption) ఇచ్చి ఉంటే వినత అసలు కాదేమో ! లేకఏదో తేడా వచ్చిన రోజున మానివేసేదేమో ! ఇలాంటి లోక సహజమైన, మానవ సహజమైన కామ క్రోధాగులవు లోనైన విషయాలనుగూర్చి ఆలోచిస్తూంటే ఇవన్నీ సహజాలు కాక తప్పవు. తన తల్లిదోషం తొలగాలని ప్రయత్నించే కొడుకు, తల్లికి ఉత్తమగతిని కోరే పుత్రుఁడు;సుపుత్రుఁడూ, మహానీతియుతుఁడూ కాక మరెవడౌతాడు ? ఈ శాపం కనపడడానికి ఏగోలాఉండొచ్చు కాని మంచి ప్రయోజనాన్ని అపేక్షించియే కదా ! రోగం తగ్గించేమందు చేదైనా తప్పదుకదా \

సరే ! ఇంత ఉద్ధృతవిధంగా పుట్టిన గరుడుఁడాకాశాని కెగిరాడు. వెంటనే క్రిందికి దిగివచ్చి తల్లికి మ్రొక్కాడు. తడయక మ్రొక్కియున్న వినతాసుతు నప్పుడు చూచి...కద్రువ వాణ్ణి పిలిచిందని వ్రాస్తాడు నన్నయ. ఆకాశానికి ఎగిరి క్రిందికి వచ్చినా ఆలస్యం అయినట్లే లేదంటే చక్కని వేగంతో వెళ్ళి వచ్చాడుఅని అర్థం. అయితే దిగీగఁగానే వినతకి నమస్కారం చేసాడో లేదో కద్రువ వాణ్ణి పిల్చింది ఆమె 'ఇడుగడ' నేసిం దట, అంటే అసూయని పొందింది. మొదటి పిల్లవాడిలా రెండోవాఁడు కూడా ఏదో అర్భకుఁడైతే ఆనందించుదామనుకున్న కద్రువకి ఈ పుత్రుడు పుట్టడమే గిట్టనిది. అందునా అతని ప్రతాపం పుట్టినక్షణంనుంచీ భయంకరంగా ఉంది. సరే-ఇదీ మంచిదే అనుకొంది తనపుత్రుల నందర్నీ ఎత్తుకొని తిరుగుతూ ఉండమని, ఏపని పురమాయించినా (తాను గాని పిల్లలు గాని) తప్పకుండా చెయ్యమని (విడువక చేయుము) ఆజ్ఞ ఇచ్చింది. ఇది కూడా 'ప్రభుత్వమేర్పడన్' ఇచ్చిందట. ఏదోమామూలుగా కాకుండా అధికారికంగా చెప్పిం దన్నమాట. ఇతఃపూర్వం వినతకి ఇలా చెప్పినట్లు లేదు. అధికారంతో కూడిన ఆజ్ఞ ఎలాగైనా ఏదోలానే ఉంటుంది. అధికారంతో కూడిన ఆజ్ఞలో కొంతమృదుత్వం - సౌహార్దం ఉంటే (అంటే చెప్పే భంగిమలో) ఆ పనిని నెరవేర్చే పద్ధతి మరోలా సుగమంగా ఉంటుంది. వినతమీద అధికారం కద్రువ చెలాయించినట్లు ఇంతకుపూర్వం అసలు ఒక్కచోటకూడా కనపడదు. అందుకే పంచశతవర్షాలు (500 సంవత్సరాలు) కద్రువవద్దదాసిగాఉన్నా వినతకి అసలేమీ బాధలేనట్లుగా నన్నయ 'ఓపినపనులు సేయుచున్నంతఁ బంచశత వర్షంబులు నిండె' అన్నవాక్యం తెలియచెప్తుంది. ఇలా నిర్ణయించడంలో హేతు

వే మంటే గరుత్మంతుడు పుట్టి అమృతం తెచ్చేలోపులో మూడు మార్పు లుండడమే.

1. గరుడునికి వినతి ప్రభుత్వ మేర్పడన్ (అధికారరీతిలో) ఆజ్ఞనివ్వడం.

2. సూర్యుడి వేడికి మాడి ఉరగాలు నేలపడిపోయినప్పుడు గరుడుని మందలించడం.

3. కద్రువ ఇంద్రుని సహాయమున పిల్లల్ని బ్రదికించుకొన్న గర్వంతో (ఉటికి) ఊరికే గరుడుని వలనా, వినత వలనా పనులు చేయించుకోవడం –

అప్పటివరకూ గరుత్మంతుడికి బాధ అనిపించలేదు. ఎప్పుడైతే తనతల్లి చేత కూడా ఊరికే పనులు చేయించుకోవడం కద్రువ మొదలెట్టిం దని అతనికి అన్పించిందో అప్పుడు తల్లిని అడిగాడు దాసీత్వ కారణం ఏమి టని ? సరే తల్లి చెప్పడం జరిగింది. ఈ పై మూడు మార్పులలో కొన్ని విశేషా లున్నాయి. పరిశీలించి చూద్దాం –

1. ప్రభుత్వ మేర్పడన్ ఆజ్ఞనివ్వడం –

తనకొడుకుల నెత్తుకొని తిరుగుమూండ మని ఆజ్ఞ నిచ్చింది. నిజానికి కద్రువ అసూయతో ఏమీ చేయలేక, వైనతేయుడైన గరుత్మంతుణ్ణి ఎలాగైనా పనిచేయించాలనే ఉద్దేశంతో తనకొడుకులని ఎత్తుకుతిరగమన్నట్లు కన్పిస్తుంది నిజానికి కద్రువవద్ద పరిచారికలు ఉన్నారు. వారు ఎత్తుకొని త్రిప్పరా ? అయినా దాసీ పుత్రుణ్ణి ఊరికే ఎందుకు వదలాలి ? ఇంతేకాక ఇంకో విశేషంకూడా అన్పిస్తుంది. ఎంతోకోపంలో పాపం ఆతల్లి ఆపిల్లలకి మరణశాపాన్ని ఇచ్చింది. పుట్టిన కొన్నాళ్ళకేగదా శాపం ఇచ్చింది. ఇప్పటికి 500 ఏళ్ళు దాటాయి. వాళ్ళలోనూ వివేకం వచ్చింది. త్వరలో మన మంతా జనమేజయ సర్పయాగంలో చచ్చిపోతా మనే నిర్వేదం వాళ్ళకి కలగడం మొదలయింది. వాళ్ళ కింకో మిత్రుడే లేడు. ఏదో పుట్టిన అనూరుడు వీళ్ళ పొందు కోరకుండానే పైకి ఎగిరిపోయాడు గరుత్మంతుడైనా ఉంటే కొంత వీళ్ళకి నిర్వేదం తగ్గుతుంది. అదీ కాక మనస్సుకి విశ్రాంతి (recreation) కలిగే అవకాశంకూడా వీడి దగ్గరుంది. వాడికున్న రెక్కలవల్ల వాడెక్కడికైనా వెళ్ళగలడు. వాడితో వీళ్ళని ముడివేసి జతచేస్తే జీవిత నిర్వేదం కొంతైనా తీరుతుంది. పైగా గరుడుడు ఆకాశాని కెగిరి అక్కడుండే లోకాలు, దిశాపాలపురాలూ అవీ చూపిస్తుంటే ఏమైనా అక్కడివారితో కొంత పరిచయమైనా ఏర్పడవచ్చు. ఏదో వారు బ్రతికే ఉపాయాన్ని వారు కశ్యపునితో కలసి ఆలోచించి నెరవేర్చుకోవచ్చు ఇలా ఊహించి అంది. కద్రువకి ఇంత ఆలోచన తట్టిందా? ఇది ఊహమాత్రమే అని భావించనక్కరలేదు. తల్లిగా తన పిల్లలకోసం ఎంత ఊహించకుండా ఉంటుంది ? వాళ్ళనిర్వేదం ఈమెకు ప్రత్యక్షబాధగా తోచదా? ఇక పిల్లలకి జీవితనిర్వేదం ఉందా? లేదా? అనే విషయంగూర్చి వేరేచర్చించుకోనక్కరలేదు. ఎందుకంటే 'మాతల్లి దాస్యం పోవాలంటే మీ కేం కావాలి ? అనగానే ఒక్క పెట్టున (ఉరగులు) 'మాకు అమృతాన్ని తెచ్చియ్యి' అన్నారు. జీవితాశతో లేక జీవించాలనే ఆశతో అమృతాన్ని అడిగారు.

ఆ పన్నగముఖ్యులని తన వీపునబెట్టుకొని అడవులూ, ద్వీపాలూ, గిరులు, అఖిలదిక్పాలపురాలూ చూపించాడు గరుడుడు. పన్నగులని అందర్నీ ఒక్క రోజున చూపించనూ లేడు. పైగా చూపిన స్థలాలన్నీ ఎంతవేగంగాచూపినా ఒక్క రోజులో అయ్యేవీకావు. కొంత కొంతమందిని రోజుకి తీసుకెళ్ళి చూపించి తిరిగి మరికొందర్ని ఆదేశ్థలానికి మర్నాడు తీసికెళ్ళడం . ఇలా చేసిఉంటాడు. ఇలా చేయవలసిన అవసరమే లేకపోయే పనే అయితే, అంటే గరుడుడు ఊపిరి సలపకుండా చేయవలసిన పని కాకపోతే, ఇంకా చెప్పాల్సివస్తే గరుడుడు ఇంటి వద్దే నిత్యం ఉండాల్సిన పనే అయితే అసలు కద్రువ అలాంటిపనే చెప్పదు. తాను చేసిన అధర్మం అందరూ గరుడునితో చెప్పకమానరు. ఆ రహస్యం ఒక నాడు కాకపోతే ఒకనాడైనా గరుడునికి తెలిస్తే దానివలనచిక్కు రావచ్చును. ఆచిక్కేదో రాకుండా ఉండాలంటే అతడు ఇక్కడ ఉండకూడదు. అదీకాక తప్పుచేసినవాని స్వభావం ఎదుటివాని తప్పును ముందుగా సూచించా లని అవ కాశం వెదకడం. ఇలా పిల్లలని త్రిప్పడం కార్యక్రమం ఒకటివీడి కప్పగిస్తే ఈ రహస్యం తెలిసేలోగా ఏదోఒకఉపద్రవం రాకమానదు. అతప్పు తనవద్ద ఉన్నప్పుడా గరుత్మంతుడుఅడిగినా తనది అధర్మం కా దని చెప్పడానికి జీవితాశనే వదులు కున్న పుత్రు లనేకు లున్నారు. వాళ్ళు భయంతో తల్లి ఏది చెప్ప మంటే అది చెప్పకమానరు. లేకపోతే ఇంతకంటే నికృష్టమైన శాపం ఇస్తుందని – భయం పాపం ! అందుచేత ఏలాగో ఒకలాగ గరుత్మంతుని దోషాన్ని వెదకాలని ప్రయత్నిస్తోంది కద్రువ. గరుత్మంతుడు కూడ ప్రతీకారాన్ని తనకు చేసిన అపకారాని సమంగా (tit for tat) చేయగల వాడే కానీ వినత యనుమతిని చేసే వాడు. వినత సాధుస్వభావురాలు అయినా కాకపోయినా జీవితంలో ఒక సారి (గుడ్డుపగులగొట్టి) దెబ్బతిన్న మనిషి. అంతగా ధైర్యం చెయ్యలేదు.

భారతంలో గొప్ప విశేషాల్లో ఒక శే మిటంటే కోపం, అహంకారం అనేవీటి శాంతపరచేందుకోపాత్రతప్పక ఉంటుంది భీముణ్ణి ధర్మరాజు చాలామాట్లు వారించడం ఈ సూత్రానికి లోబడినదే. అంటే

కాంతానికి లోబడినవే క్రోధాహంకారాములన్నీ. అయినప్పుడు శాంతస్వభావుడు తెరగబడితే అంటే శాంతం స్వల్పరూపం అయినప్పుడు కామక్రోధాదులన్నీ విజృంభిస్తాయన్నమాట. అందుకనే అలుంగుటయే యెఱుంగనివాడు...... అలిగితే ఏమౌతుందో వివరింపబడడం జరిగింది. అది అత్యంతస్థితి. సరే! ఈలాగ గరుత్మంతునిలో దోషారోపణం చేయాలి; అని వెదికే కద్రువకి ఓనాడు ఎలాగా అనుకున్నట్టే దోషం దొరికింది.

2. గరుడుని మందలించడం:- సూర్యుని మండలం వరకూ ఎగిరివెళ్ళిన ఒక సందర్భంలో పాదాలు ఆ వేడికి తాళలేక మూర్ఛపడిపోతే అతిభక్తితో ఇంద్రు నారాధించి కద్రువ తన వంశాన్ని నిలబెట్టుకుంటుంది. 'కద్రువ కడు నలిగి- గరుడునిం బదరి' అంటాడు నన్నయ. ఆ అలగడం- మందలించటం ఎంతగా ఉన్నాయి అంటే వినతా-గరుడుడూ వీరిద్దరిచేత ఊరికే (పనిలేకపోయినా) కద్రువపనులు చేయించుకుంటున్నదని వారికి తెలిసినా, వారు ధైర్యంగా అడగనంత విధంగా. ఇది వినత ఎట్లాగో సహించింది కానీ గరుత్మంతుడికి ఏదోలా అన్పించి ఈ సమయంలోనే 'వారికిం బనుల్ సేయఁగ నేమి కారణము?' అని అడిగాడు. వినతకూడా తనంత తానుగా చెప్పడం కంటే వాడిచేత అడిగించుకొని చెప్పడంలో ఔచిత్యం ఉంది. 'నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్' (ఎవరైనా అడిగితే నేకానీ చెప్పకూడదు) అనే సిద్ధాంతం చాలామంచిది. అంతేకాక గరుత్మంతుడికి తగిన వయస్సు ఇంకా రాలేదు. కద్రువ స్వరూపస్వభావాలు గరుడునికి తెలిసిన మీదట వినత కద్రువనిగూర్చి చెప్పితే అప్పటి వైరం-కద్రువనిగూర్చి గరుడునికి తెలియక పూర్వం చెపితే అంతగా అంతగా ఉండక పోవచ్చును గదా.

3. ఇంద్రవరం వల్ల పిల్లల్ని బ్రదికించుకోవడం: అసలు రహస్యం ఇక్కడుంది. కద్రువచాలా పలుకుబడి గలది. ఒక్క స్తోత్రంతో ఇంద్రుణ్ణి ప్రసన్నుణ్ణిగా చేసికొని తనవాళ్ళందర్నీ బ్రదికించుకో గలిగినది. ఇక్కడ ఒకేఒక్క స్తోత్రపద్యంతో ఇంద్రుడు ప్రసన్నుడు కావటం విశేషం. ఇల్లాంటిది ద్రౌపదీమాన సంరక్షణంలోకూడా కన్పిస్తుంది. భామిని కృష్ణఁ దలంచె భీతయై... .. అని మాత్రం ఒకే పద్యంలో నన్నయ చెప్తాడు. అక్కడి భక్తిభావం అంగిఐపోయి మిగిలినవానిని కప్పిపుచ్చి అంగాలుగా చేసుకోకూడదని నన్నయభావం. రససిద్ధుడు నన్నయ ఏవోకొన్ని పదుల పద్యాలు చెప్తే ఈ సొంపు అసలురాదు సరిగదా చెడిపోతుంది.

అక్కడ ద్రౌపదీ శ్రీకృష్ణుల ఉపకారోపకార్య సంబంధంలాంటిదా? ఈ కద్రూపురందరుల సంబంధం అనిపించేంతగా ఉంది. అయితే; నన్నయ అన్నిచోట్ల స్తోత్రం అనేది ఒక పద్యంలో చేయలేదు. 'అనంతుడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్'- అని ఉదంకస్తుతిలో ఈ భేదం స్పష్టంగా కన్పిస్తుంది. దీనికి కారణం సముచిత పరిచయాభావం. అంత పరిచితుడైన ఇంద్రుడు కాబట్టి బ్రతికించాడు. ఆ విషయాన్ని గరుడుడు గమనించాడు. అందుకే అతడు 'ఆయాతపక్షతుండహాతిన్ ..' అని ప్రారంభించాడు. కులపర్వతాల రెక్కల్ని మాత్రమే విరగ్గొట్టినవాడు ఇంద్రుడు. నేను ఆ కులశైలాలని అన్నింటినీ నుగ్గుగాచేయగలిగిన వాణ్ణి-భీతిచెందకు అని తల్లిని సమాధానపరచాడు. తాను రోజూ తిరిగే దిశాపాలకుల్లో ఒకడు ఇంద్రుడు. ఏమీ తెలియనివాడూ కాడు తనకి. అప్పుడు తల్లి తన దాసీత్వకారణం మొదలైనవి చెప్పఁగా గరుత్మంతుడికి ఒక విధమైన భావంజనించింది. కద్రువతోడి వ్యవహారం ఫలభాక్కు కాదని ఆలోచించాడు. గరుత్మంతుడికి ఏలాగైతే విషయావగాహనశక్తి వచ్చిందో కద్రూసుతులకీ అలాకే వచ్చింది. కొంచెం ముందే కూడా వచ్చింది. కద్రువ పిల్లల్ని అడిగితే కద్రువ నడిగినంతగా పరిస్థితిఉండబట్టే' మాతల్లి దాస్యం పోవాలంటే మీ కేం కావాలి? అని కాద్రవేయుల్ని అడిగాడుట. వాళ్ళైనా 'మాఅమ్మని అడిగి చెప్తాం' అనకుండా వాళ్ళే 'అమృతం కావాలి' అనడంలో విశేషంకూడా ఇదే. వాళ్ళకి అంత అధికారం ఉందనే విషయం నిజంకాబట్టే 'అమృతాన్ని తెమ్మన్నారు-వెళ్తాను' అని గరుత్మంతుఁడనఁగానే 'అలాగే' అంది కాని, 'కాద్రవేయుల్ని కాదు-'కద్రువ నడగాలి' అని కనీసం సంకోచపడలేదు. వినత ఇన్ని ఇన్ని ప్రసన్నవిశేషాలుంటాయి నన్నయ గంటంలో. ఇలా నన్నయ సాహిత్యేందిరా ప్రసూనాలని పరిశీలిస్తే ఒక్కొక్కటి ఒక్కొక్కతీరు పరిమళాన్నిస్తూంటుంది. అమృతం తేవడం జరిగినా కాద్రవేయులకి లభించకుండా పోయింది.

గరుత్మంతుడి వైరం అంతటిది. అంతటితో ఆగక గరుత్మంతుణ్ణి అంతదాసుని చేసినవాళ్ళే ఆహారంకూడా అతనికి అయ్యారు, 'మరణాంతాని వైరాణి' అన్పిస్తుంది కథ చివరకి. కద్రువ అసూయాభావం అహంకారంగా మారి స్వవంశనాశనానికి చేటుఅయింది. అరిషడ్వర్గాల్లో క్రోధమాత్సర్యాల ప్రభావం ఇలాంటిది. క్షేత్రాన్నిబట్టి సస్యంకదా! నా దృష్టికి కన్పించిన నన్నయ ఇంతవాడే. ఇంకా ఉన్న సహృదయుల దృష్టిలో మరింకెంతవాడో కదా!

—•••—

# భారతమాత

కవయిత్రీ తిలక శ్రీమతి విశాలశ్రీదేవమ్మ

అమ్మా! భారతదేశభూజనని నీ దౌ సారసంపత్తిచే
నెమ్మెల్ మీఱుచరాచరమ్ములు కరం బేపొంది యుండంపులో
కమ్మై భానిలు నెల్లవేళల జగత్ కళ్యాత సంధాత్రి వీ
వమ్మా? భారతమాత గైకొనుము నోహారుల్ సమర్పించెదన్.

అమల హిమాద్రి వజ్రమయమై వెలుఁగొందు శిరోవిభూష గా
యమునయుం, గంగ, కంఠమున హారములై యలరాచుండ గౌ
తమి కటిసూత్రమై మెఱయ తావకపాదములందు నందనై
విమల నదుల్ జెలంగ కను విందు ఘటింతువు భారతాంబికా.

సత్యసంధులు హరిశ్చంద్రుఁడు రాముఁడు
దశరథ రాజాది ధన్యతములు
దాతలు శిబియు, మాంధాత, జీమూతవా
హన దధీచులు కర్ణుఁడాది ఘనులు
ధర్మాత్ము లల పాండుతనయులున్ బలదేవ
హరి విదురాది దేవాంశభవులు
పరమపవిత్రులు వ్యాసపరాశర
కౌశిక శుక శౌనక ప్రముఖులు.
యుగయుగమ్ముల నీ యందు నుద్భవించి
మార్గదర్శకు లైరిగా మాకు నెల్ల
ఎంత పుణ్యాత్మురాలవో యేమొ నిన్ను
పొగడ సాధ్యమె భారత భూసవిత్రి.

అతిరుచ్యమ్ముల వారి పూరముల మే లందంపు శైలమ్ములన్
తతభూజమ్ముల నోషధీలతలతో దట్టమ్ములౌ కానలన్
ధృతిమీరన్ ప్రతి జీవజాలమునకున్ నిత్యంపుసౌఖ్యమ్ముసం
గతమా భారతమాత? నీదగు లసత్కారుణ్య సత్సంపదన్.

కొండల కోనల నడుమను
వెండియు, బంగారు, గొప్పవెలగల రతనాల్
పండించి యిడెదు ప్రజలక
ఖండదయన్ భరతమాత కవిజన గీతా

వేదము మొదలుగ నాయు
ర్వేదము జ్యోతిషము జ్ఞాన విజ్ఞానంబుల్
బాగుగొని యుండు నీలో
ప్రాదుర్భావమ్మునంగి భారతజననీ.

శాంత్యహింసలతోడ సర్వ ప్రపంచము
నరికట్టి నట్టి మహాత్మ గాంధి
శౌర్య పటిమ మీఱ జని తెల్లవారల
గాసి దూలించిన ఘనుఁడు బోసు
ప్రతిభఁ మీఱగ నగ్రరాజ్యాల సమితిలో
మెలగుచు నేలిన మేటినెహ్రు
చాకచక్యమ్మున శత్రులనణచిన
ధీరుఁడు లాల్ బహదూరు శాస్త్రి
దండిశూరుడు శ్రీప్రకాశుండు తిలకు
మొదలుగాగల యెందరో సదయ హృదయు
లైనవారల కమ్మవై యలరు నీకు
సాటిలేరమ్మ భారతజననీ? యెందు.

అయిన నొక్క విషయ మాలకించగదమ్మ
నాదు పలుకు కలుగ రాదు సుమ్మ
భాగ్యవంతమగుచు బరగెడి నీలోన
లేమి కొంత బాధ లేపె నమ్మ.

ఒకఁడు నిన్ను వంద లెకరాలకును మించి
వాడు కొంచుమేడ నీడ నిల్వ
నొకఁడు సెంటు కూడ నొక్కెడ వాడగాఁ
జాలకుండె భరత జనని కనుము.
ఉన్న డబ్బులన్ని కన్నవారల విద్య
కూడ్చి పెట్టి చేత నొక్క కాసు
లేక పదవు లేమి రాక మహార్తి నీ
కన్నజనము కలఁగ కంటె మాత!
చక్కెర జున్ను క్షీరముల చక్కగ నొక్కటిచేసి మక్కువన్
మెక్కఁగ నొక్కబిడ్డ మితిమీఱిన లేమిడి నుప్పుగంజియున్
జిక్కక నొక్కబిడ్డ కడుఁ జింతిలు భారత భూసవిత్రి? నీ
కక్కటయుండదొక్కొ కెకదమ్మ? కృపన్ సమదృష్టిఁ గాంచుమా.

కూరిమి నీ సంతానము
సారంపు సుఖమ్ములంది సంతుష్టంబౌ
తీరున మన దీవింపుము
భారత భూమాత పూత భాగ్యోపేతా.

# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

విమర్శగ్రంథాలు.-సృజనాత్మకమైన ఒక విలక్షణశైలిలో ప్రత్యేకవిషయాలను గూర్చి విశ్వనాథవారు చేసిన విమర్శ గ్రంథాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి నాలుగు.

నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి - ఈ కోవకు చెందినవాటిల్లో ప్ర ప్రథమంగా పేర్కొనవలసిం దీ పుస్తకం. 1948లో మొట్టమొదట వ్యాసాలరూపంగా 'భారతి'లో ప్రకటించబడింది. ఇందులో నన్నయగారి కవితా శిల్పవైశిష్ట్యంగూర్చి విమర్శించడం జరిగింది.

నన్నయగారు తన కావ్యంలోని ప్రధానగుణం ప్రసన్నకథాకలితార్థయుక్తి అని చెప్పుకున్నారు. దీనికి నాల్గయిదు విధాలుగా అర్థం చెప్పవచ్చు. 'ప్రసన్నకథయొక్క, కలితార్థముయొక్క, యుక్తి-అనగా కలితార్థములో ప్రసన్నమైన కథయుండుట కథప్రసన్నమగుట' 'కథాకవిత' అనే పాఠాంతరం తీసుకుంటే 'Narrative poetry' ('నేరేటివ్ పొయిట్రీ') అనే శబ్దార్థానికి సరిపోతుందికాని ఈ 'కథాకవిత' మన పూర్వలాక్షణికులలో లేదు. కాబట్టి 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' అనే పాఠమే సమంజసం అని విశ్వనాథవారి తీర్పు.

కవిచే వాడబడిన భిన్నశబ్దార్థాలనూ, వాక్యార్థాలనూ, కథాగత భిన్నాంశాలను, జాగ్రత్తగా పరిశీలిస్తే కథాప్రసన్నత కలుగుతుంది. ఈవిషయాన్ని విశ్వనాథవారు- అనేక ఉపాఖ్యానాల ద్వారా సోదాహరణంగా విమర్శించారు. కద్రువశాపంలో 'మీరు పంచత్వము సనియెదు' మని కాక ప్రథమపురుషలో శపించుటలోగల చమత్కారం, దేవయాని, 'తన్నుద్ధరింపు'మనడంలోగల పరమార్థం (ఉత్ + ధరణము; ఉత్ + హరణము), సుకన్యోపాఖ్యానంలో ఆమెను 'విద్యుల్లతాంగి' అనడంలో గల స్వభావచిత్రణం, ఋష్యశృంగునికథలో వర్ణించిన యౌవన వికార స్వరూపం, నలచరిత్రలో దమయంతీదేవి కున్న ప్రాధాన్యం, శివస్వరూపమైన హంస దౌత్యంలోని విశేషం, ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టంలో 'మున్న పనీత మయిన తద్వస్త్రమ్ము నట్టివలువ లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచున్న' దని నన్నయ్యగారు వ్రాయడంలోగల విశిష్టత; విమర్శించి విశ్వనాథవారు తమ కళానైపుణ్యం చాటుకున్నారు.

అలాగే దుష్యంతచరిత్రంలో కథాస్వరూపాన్ని ముఖ్యఘట్టాలనూ, వాని స్వభావచిత్రీకరణనూ చాల విపులంగా వ్యాఖ్యానించారు. 'నన్నయగారి శకుంతల నిశ్చయజ్ఞానము కలది, ఆమె తపస్విని, యోగిని కారణజన్మురాలు .. భూమి కవతరించిన శశిరేఖ. ధర్మవేత్త్రి. ఋషికల్పురాలు. కాళిదాసు శకుంతలయందు మేనక ప్రసన్నురాలైనచో నన్నయ్యగారి శకుంతల యందు ఆకాశనిష్ఠమైనశబ్దబ్రహ్మము నిత్యప్రసన్నమై యున్నది. ఈమెది ఆర్ష వివాహము. కాళిదాసు శకుంతలది గాంధర్వవివాహము. ఈమె దుఃఖితురాలు' అని (173-175 పే) విశ్వనాథవారు నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తిని వేనోళ్ళ కొనియాడి తమకు నన్నయగారిమీదగల ప్రత్యేకాభిమానం ప్రకటించుకున్నారు

అంతేకాక 'ఆయన అనంతముఖశిల్పం' అనే భాగంలో నన్నయగారి కవితాశిల్ప పద్ధతుల్ని సోదాహరణంగా వివరించారు విశ్వనాథ. ఒక్కమాటలో, అక్షరంలో నన్నయగారు ప్రకటించే వినూత్నభావ వైచిత్ర్యాలు, భావానుగుణంగా వాడు వృత్తవిభేదాలు, ప్రవాహంలాసాగు పద్యపాదం హఠాత్తుగా విరగడంలోగలధ్వని తరంగవైశిష్ట్యాలు, నన్నయగారి నానారుచిరార్థసూక్తినిధిత్వపటుత్వాలు సత్యనారాయణగారు తెలియచేశారు.

భాషకు నుడికారం ప్రాణం. ఈనుడికారం నన్నయ్యగారిలో సమృద్ధిగాఉంది. ఆయన దేశ్యశబ్దాలు చాల విరివిగా వాడతారు. 'నన్నయభాషనుండి యీ తెనుగు శబ్దమిట్లు వాడినాడు. ఈ సంస్కృతమిట్లు వాడినాడని చెప్పుట యఖండ గోదావరిలో నివి శబరినీళ్ళు, ఇవి కిన్నెరసానినీళ్ళని చూపింపబోయిన ట్లుండును' (196, 197 పే) అని విశ్వనాథ ఘంటాపథంగా ప్రకటించారు.

నన్నయగారి వచనరచన ఒకప్రత్యేక బాణీలోఉంటుంది. 'తిక్కనగారి గడుసు మాటలలో సగానికి సగము నన్నయగారి వద్దఁ దెచ్చుకొన్న ట్లుండును.

'అనంతమైన పద్యవిద్యకు నన్నయగారు గురువు. ఆయన యీ మహావిద్యకాద్యుడు. ఎన్నిమార్గముల తెలుగుభాష పద్యరచన సాగవచ్చునో యన్నిమార్గములకు నయ్యెయెడల సూచనగా పునాదులు వేసెను ...ఏ కథకు నే భావమునకు నేశయ్య, యేశబ్ద మెట్టిరచన, యనుకూలమో నిసర్గపరిచితిదక్షమో వెలార్చు శక్తిమంతుడు' (పే. 210,211) అని నన్నయగారిని అసాధారణ ప్రతిభాశాలిగా, మహాకవిగా వర్ణించి ఆ ఆదికవికి తమ కృతజ్ఞతను తెల్పుకొన్నారు విశ్వనాథ.

అల్లసానివాని అల్లిక జిగిబిగి.-విశ్వనాథవారిని నన్నయ తరువాత బాగా ఆకర్షించినవాడు పెద్దనామాత్యుడు. అందు మొట్టమొదట స్వతంత్రకావ్యం తెల

గులో పెద్దనగారే వ్రాశారని కావ్య లక్షణాలు పట్టిస్తే మనుచరిత్రే మొదటి కావ్య మనీ సత్యనారాయణగారు తమ గాఢవిశ్వాసం చాటుకున్నారు.

'అల్లిక జిగిబిగి'లో అల్లిక అనేది కావ్యగత మహాశిల్పానికీ, 'జిగిబిగి' అనేది దానిలోని చిక్కనకూ లక్షణాలుగా ఉన్నాయని విశ్వనాథ వ్యాఖ్యానించారు.

ప్రప్రథమంగా పెద్దన చేసిన దేవతా స్తుతిలో అయిదుపద్యాలూ కావ్యార్థ సూచకాలుగా ఉన్నాయని తమ నిశిత పరిశీలనాదృష్టిని ప్రదర్శించారు. విష్ణుమూర్తి స్తుతిలో సనక సనందనాదులుపడిన భ్రాంతిచే వరూథిని మాయాప్రవరాఖ్యునియందుపడిన భ్రాంతినీ, శివస్తుతిలో పార్వతి ఉల్లాసమాడడంలోగల విషమాలంకారం, వరూథిని కన్నసంతానం గంధర్వుడికికాక ప్రవరుడికే కన్నదని చాటే రహస్యం, బ్రహ్మస్తోత్రంలో సూచింపబడ్డ స్వారోచిజీవితం, విఘ్నేశ్వరుని ప్రార్థనలో నిరూపింపబడిన మనువు యొక్క మనోధర్మం, తెలియజెప్పి పాఠకులను ఒక్కసారి ఆశ్చర్యమగ్నులను గావించారు విశ్వనాథ.

'కావ్యగ్రథనకౌశలమే చివరిమెట్టు. ఇది కవియొక్క బుద్ధికి సంబంధించినది. పద్యరచనాదులు వానికవితాశక్తికి సంబంధించినవి ..మహాకావ్య పరిజ్ఞానము లేని, తత్పరిజ్ఞానము వెలయించనేరని కావ్యము కావ్యము కాదు. ఈపరిజ్ఞానాతిశయము భాసించిన కొలది మహాకావ్య మగును. అతడు మహాకవి యగును. ఇందు విప్రతిపత్తి లేదు. మనుచరిత్రము నీ దృష్టితో విచారించవలయును. అప్పుడు మనుచరిత్రము మహాకావ్య మగును. పెద్దన్న మహాకవి యగును' (16, 17 పే) అని విశ్వనాథవారు ఆకావ్యాన్ని పరిశీలించవలసిన పద్ధతినికూడా వివరించారు.

'స్వారోచిషమనువుకు పరమోత్తమ మానవధర్మ పరిపాలనా సమర్థమైన జీవశక్తి సాక్షాత్కారరూపంగా అతని జీవసంపుటిలో ఉందని నిరూపించడమే కావ్యప్రయోజన' మని అంటారు విశ్వనాథ.

మనుచరిత్ర అనడంలో మనకు ముఖ్యంగా గుర్తువచ్చేది వరూథినీ ప్రవరాఖ్యుల ప్రణయఘట్టం. ఈసందర్భంలో డాక్టర్ విశ్వనాథవారు ప్రవరాఖ్యుడికి తీసిన 'ఎక్స్‌రే'లో చాలా క్రొంగ్రొత్తవిశేషాలు వెలువడ్డాయి. ప్రవరాఖ్యుడు చాలా గడుసువాడనీ, గొప్ప లౌకికుడనీ, ధర్మవిముఖుడు గాని, భోగవిముఖుడు కాని కాడనీ, ఇంద్రియలోలుడు కానట్టి రసజ్ఞుడు కాని; సౌందర్యం తెలియనిమూర్ఖుడు కాడనీ, వరూథిని పడిన తొందరపాటే రసాభాసానికి కారణమనీ విమర్శించారాయన. (71, 72 పే) ఇక్కడనే 'ఇవియా మీసంప్రదాయార్థముల్'అని ప్రవరాఖ్యునిచే పలికించి పెద్దన భారతీయమతపు ఆయువు పట్టును పట్టుకొన్నాడని ప్రశంసించారు.

పెద్దన విశిష్టాద్వైతి. నిజంగా ప్రవరుని కథ ఆసిద్ధాంతాన్ని ప్రతిపాదించడం లేదు. ఆమతానికి 'ఆనందో బ్రహ్మ' అనే మాట పొసగదు. కాబట్టి 'ఇవియా మీసంప్రదాయార్థముల్' అని పెద్దన త్రోసివేశాడు. ఎందుకంటె అతని విశిష్టాద్వైతంలో ఆనందం పరమేశ్వరస్వరూపం. ప్రవరుడే మతావలంబకుడో సరిగా నిర్ణయించలేకపోయినా అతని పద్ధతినిబట్టి 'వానిని స్మార్తునిగా, కర్మిష్ఠిగా భావించవచ్చును'అని సర్వసమ్మతంగా చెప్పారు. విశ్వనాథ.

మరోరహస్యం. స్వారోచిషమనువు చేసినలక్ష్మీధరస్తుతి స్థూలంగా అద్వైతంగానే చెప్పవచ్చుకాని, విశిష్టాద్వైతంలో జగత్తునకు కారణభూతుడైన నారాయణుడే ఈపద్యమున స్మరింపబడడం విశేషం. అంతేకాక స్వారోచిషుడు చేసిన దశావతార వర్ణన విశిష్టాద్వైతసిద్ధాంతప్రకారమే ఉంది. ఆమతంలో బుద్ధుడు లేడు. బలరాముడు, కృష్ణుడు అని వేరువేరుగా అవతారాలు లెక్కపెట్టడంవల్ల పది పూర్తవుతాయి. ఇది పెద్దనగారు మనుచరిత్ర చివరలో కూర్చిపెట్టినారు.

ఇటువంటి విశేషార్థాలనూ, సద్విమర్శలనూ అందించడంలో విశ్వనాథవారు అందెవేసిన చేయి.

ఒకడు నాచనసోమన్న:- పెద్దన్న తరవాత విశ్వనాథులకు ప్రీతిపాత్రుడు సోమన్న. సత్యనారాయణగారు మొదట తమ రామాయణ కల్పవృక్షావతారికలో పూర్వకవి సంస్తుతి చేస్తూ 'ఒకడు నాచన సోమన్న' అని అతని కవితావైశిష్ట్యాన్ని ప్రశంసించారు. అదే తరువాత ఆకవిని గూర్చి వ్రాసిన విమర్శ గ్రంథానికి నామంగా వెలిసింది. ఇందులో మొదటి నాలుగు వ్యాసాలూ 'జయంతి'పత్రికలో (1960 మార్చి-జూలై) ప్రకటించబడినాయి. నాచన సోమనాథుడు తన్ను గూర్చి 'నవీనగుణసనాథు' డ ననీ 'సంవిధానచక్రవర్తి' ననీ చెప్పుకున్నాడు. ఈ రెండుగుణాలు అతనికవిత్వంలో ఎంతవరకూ పోషింపబడినాయో విశ్వనాథవారు సోదాహరణంగా విమర్శించారు.

ఉత్తరహరివంశం విష్ణుపారమ్యప్రతిపాదక గ్రంథం అయినా ఇందులో శ్రీకృష్ణుడు కుమారునికోసం శంకరుణ్ణి ప్రార్థించడం, బాణాసురకథలో శివకేశవులు చేసినయుద్ధం ఇత్యాది విషయాలను పరిశీలిస్తే కనిపించేది అద్వైత సిద్ధాంతం; అని విశ్వనాథవారు వ్యాఖ్యానించారు. హంసడిభకోపాఖ్యానంలో, నరకాసురవధలో శ్రీకృష్ణునిద్వారా సంకల్పింపబడిన శిష్టరక్షణ, దుష్టశిక్షణాది కార్యక్రమాలలో విష్ణుపారమ్యాన్ని ప్రతిపాదించి ఏకవాక్యతాస్వరూపాన్ని సోమన

సాధించి సంవిధానచక్రవర్తి అయాడని విశ్వనాథవారు నిరూపించారు. ఊర్వశీ నరకాసురుల సంవాదంలో రచనాశిల్పం, మహర్షులు శ్రీకృష్ణుని దర్శించినపుడు వ్యంజింపబడిన విష్ణుతత్త్వం, నరకాసుర కథలోని ఖగోళశాస్త్ర రహస్య ప్రతిపాదనా విశిష్టత్వం తెలియజెప్పి సోమన నవీనగుణసనాథుడయ్యా డని విశ్వనాథ వారు చాటారు. నాచన సోమన్నకు సాహిత్యపోషణయన్నబిరుదు సార్థకమని విశ్వనాథుల అభిప్రాయం.

శాకుంతలముయొక్క అభిజ్ఞానత:- ఇది 'జయంతి' పత్రికలో 1958-59 వత్సరాల్లో వ్యాసరూపంగా వెలువడింది. కాళిదాసు నాటకంలోని నాందీశ్లోకం వ్యంజించిన కథాసంవిధానం, విదూషకుడు దుష్యంతుని మనఃస్థానీయుఁ డని అనడానికి గల కారణం, శివాద్వైతప్రతిపాదితంగా నిర్వహింపబడిన ఘట్టాల విశేషం విశ్వనాథవారు చక్కగా విమర్శించారు.

ఈనాటకంలో శృంగారరసం ఏ విధంగా పరిపోషింపబడిందీ వ్యాఖ్యానించి, దుష్యంతుడు నాయకి అయిన శకుంతలను ఒక పువ్వుగా వర్ణించడంలోని పరమార్థం అపువ్వు ఫలించి చక్రవర్తి కాగల ఒక పుత్రుణ్ణి ప్రసాదించువనడమే అని వివరించడంలో సత్యనారాయణ గారి సూక్ష్మదృష్టి దుష్యంతుడికి కలిగిన విస్మృతి కాళిదాసు ప్రవేశపెట్టిన గజవృత్తాంతంలో ధ్వనిస్తున్న దని ప్రకటించడంలో విశ్వనాథవారి విమర్శనా వైఖరి ప్రస్ఫుటమవుతున్నవి.

శాకుంతలంలో పంచమాంకం శిఖరాయమాణ మని ఆయన అభిప్రాయం. ఇందులో దుష్యంతుని స్వరూప స్వభావాలు చిత్రించబడినాయి. ఈ విషయం చాలా జాగ్రత్తగా పరిశీలిస్తేకాని ప్రకటించడం కష్టం. అందుకే పాఠకులను దృష్టిలో పెట్టుకొని విశ్వనాథ 'ఎంతమందికైనను కావ్యమును పఠించుట అనగా మధురశబ్దసంయోజనమును పర్యాలోచించుటయు, ఉక్తివైచిత్ర్యమును పరిశీలించుటయు, ఉపమాద్యలంకార రమణీయతాపరామర్శ చేయుటయు, ప్రకృతి వర్ణనము - పాత్రపోషణము - తత్కాల విషయపరిగ్రహణము మొదలైన విషయములను సమాలోచించుటయు అనువాని తోడనే సరిపోవుచున్నది నిజానికి పైని చెప్పిన విషయములన్నియు లేకుండ ఉత్తమకవిత్వములేదు, కాని వీనియన్నింటికి మించిన మహావిషయ మొకటికలదు. లోతునకుదిగి విచారించిననే కాని అది తెలియదు' (81 పే) ఎందుకనగా 'మహార్థములను శిల్పదృష్టితోఁ జెప్పువాడు కవి' (6 పే)

కాబట్టి కావ్యంలోని మహార్థాలు సామాన్య పాఠకునికి అవగతం కావడానికి విమర్శ చాలా తోడ్పడుతుందని విశ్వనాథ అంటారు. 'అన్నిటిని కలిపి చెప్పగలిగినది కవివాక్యము. విడివిడిగా చెప్పునది విమర్శకుని వాక్యము. కవి వాక్యములోని సర్వార్థమును ఒకసారి భావుకునకు స్ఫురించును. విమర్శకుని రచన పాఠకులకు తెలియును' (7 పే)

దీనినే సి. నా. రె. ఒకచోట 'కప్పి ఉంచేది కవిత్వం. విప్పిచెప్పేది విమర్శ.' అంటారు.

శాకుంతలంమీద ఇప్పటివరకూ వెలువడిన విమర్శనాగ్రంథాలలో విశ్వనాథ వారిదే అత్యుత్తమ మని చెప్పవచ్చు.

(సశేషము)

# మురళి

సామంతపూడి 'కమలనాథ్'
దశరథ రామరాజు

మురళి మాయలోన బడిరి మునులు కూడ
గోపికా వనితల్ పడకుండు టెట్లు?
మురళి పాటలో నెంతటి మురిపముండె
నల్లవాడు గడుసు గొల్ల పిల్లవాడు.

వెదురు బొంగులో నెంతటి వింతయుండె
రంధ్ర ముండిన చాలును రాగ మురళి
రంధ్ర మటు లేకపోయిన రాదు రవళి
ఈ మురళి మూగవోయిన నేలబ్రదుకు ?
మూగ వానికి మాతయె మురళిరవము.

గోపకాంతలే మురళిగ రూపుదాల్చి
నారు యౌవన శృంగార ధారలన్ని
ధారవోసి మురళి రూప మైరి కృష్ణు
మోవిపై నిల్వ మోహాతి మోహముగను
అందుకె మురళి చిందించు నమృతసుధలు.

విరహవేదన వ్యక్తమా మురళిలోన
అటులగాకున్న గోపికాపటల మంత
పరుగిడుదురేల పిల్లల పతుల వీడి
పరమ పురుషుని కృష్ణుని మురళి వినుచు.

వేణుగానములోనున్న జాణతనమె
తరుణహృదయాల సంగీత భరితరసము,
పాంచజన్యములోనున్న ప్రౌఢగుణమె
దుష్టశిక్షలోనున్న దుడుకుతనము.

నీవును నిమిత్తమాత్రుడవే విజయుని
కైవడి, మురళి పాంచజన్యంబు లేను
కీర్తిని సముపార్జించెను కృష్ణ, నీను
గొప్పదనమేమి కలదయ్యా కొంటెకృష్ణ.

మురళి తలచిన జాలును మునులు గోగ
ణమ్ము గోపికల్ నిలుతురు సమ్ముఖమున
వారలెంత పుణ్యము జేసినారొ మనుపు
మురళిగాన సుధారసమున మునుంగ.

# "ఏణరాజు" గ్రంథ సమీక్షపై లేఖ

శ్రీ యుత 'సాహిత్య సమాలోచన' పత్రికాధిపతులకు నమస్సులు.

ఆర్యా!

16-11-'78 తేదీ గల మీ పత్రిక యందు 'గ్రంథ సమాలోచన' అను శీర్షిక యందు శ్రీవారణాసి వేంకటేశ్వరులుగారి 'ఏణరాజు' కావ్యమునుగూర్చి శ్రీప్రసాదు గారి విమర్శనమును ఇటీవలనే చూచితిని. వారు చక్కని విమర్శనాదృష్టితోనే సమీక్షించిరి. ఏణరాజు కథను సంగ్రహించిరి. వర్షావర్ణనము మనోహరముగ నడచిన దనియు 'దరదళితపద్మ' వంటి పద్యములు మనోజ్ఞములుగా నున్నవనియు, భోగవర్మ కావ్యవర్ణన మున్నగునవి బాగున్నవనియు, ధనగుప్తుని వివేకలోభముల వర్ణన బాగున్నదనియు, ఏణరాజు వాక్చాతురి ఇత్యాగులు ప్రశంసనీయములుగ నున్నవనియు మొత్తముమీద కావ్యము రసవన్మార్గమున పయనించిన దనియు శ్రీ ప్రసాదుగారు వివరించిరి. వారి సమీక్షలో నీక్రింది కొన్ని సందియములను ప్రకటించిరి.

1. 'పునిత'పదము :- పూఞ్ ధాతువు నుండి పూత యుత్పన్నమగును గాని 'పునీత' యుండదు కదా యనిరి. కాని పునిత పదము శబ్దరత్నాకరము, వావిళ్ళ నిఘంటువు, శబ్దార్థచంద్రిక, శబ్దార్థదీపిక మున్నగు నిఘంటువులందు పవిత్రార్థమున కూర్పబడినది. ప్రౌఢ వ్యాకరణకర్త శ్రీ సీతారామాచార్యులు, శ్రీ బులుసు వెంకటరమణయ్యవంటి మహాపండితులచే శబ్దరత్నాకరాది నిఘంటువులయందు ప్రయుక్తమగుటచే నీపునితపదము ప్రయోగార్హము కాదని యెట్లు చెప్పగలము? కావుననే కవి యాపదమును ప్రయోగించెను. కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథవారు కూడా ఈ పదము నుపయోగించి యున్నారు.

2. కౌశికసాఖ్యగోత్రము :- ఆఖ్యయా సహవర్తతే ఇతిసాఖ్యం ప్రసిద్ధితోకూడి నది అని యర్థము. కౌశికేనసాఖ్యం - తాదృశం గోత్రం కౌశికసాఖ్యగోత్రం. కౌశికుని మూలమున ప్రసిద్ధివడసిన గోత్ర మని యర్థముచెప్పినచో నయ్యది సాధువే యగును. లోకమున మీగోత్రమే మని యడుగ 'కౌండిన్యస-భారద్వాజస' అని సమాధానము చెప్పుట శిష్టవ్యవహారమున నున్నది. అది పొరపాటని భావించినచో పైవిధముగా సాధింపవచ్చును.

3. వాచావ్రతనిష్ఠుడు:- ఈసమాసము విచారణీయ మనినారు. ఎందువలన విచారణీయమో తెలుపలేదు. బహుశః శ్రీ ప్రసాదుగారు 'వాక్ + వ్రత=వాగ్వ్రత' అని యుండవలెనని భావించియుందురు. 'ఆపంచైవహలంతానాం యథా వాచా దిశా నిశా' యన్నట్లు వాచాశబ్దము ఆకారాంత స్త్రీలింగశబ్దము. కాఁగా 'వాచావ్రతనిష్ఠుఁడు' అను సమాసము సమంజసమే.

4. మురిసిపోయిన దశే భరతమాత త్వదీయ జననవిశేషపూజ్యతను గాంచి' అనుచు నిట భరతమాతృవాచకమై షష్ఠీ తత్పురుష కావలసియున్నదని శ్రీప్రసాదు పల్కినారు. ఇందు భరతమాత యను పదము ప్రథమావిభక్త్యంతము. భరత మాత మురిసిపోయినదని భావము. అట్లు గాక 'భరతమాతృ' అని షష్ఠీతత్పురుషమైనచో అర్థము కుదురదని శ్రీప్రసాదు' గా రాలోచింపక పొరపాటుపడిరి.

5. 'కీర్తి నల్దిక్కుల నింపినట్టిది కదే' అనుపద్యమున 'కదా' అనియున్న మరింత స్ఫూర్తిగా నుండెడిది.' అనినారు. 'కదే-కదా' అను రెండును సమానార్థకములే. పైగా'కదే'యనుచోట 'దే'యతిస్థానము 'కదా' యనినచో 'దా' యను నక్షరమునకు యతి చెల్లదు. 'అచ్ఛతుష్కంభవేత్ప్రాణిస్థితం ప్రశ్నాదివాచకం' అను నథర్వణకారికయు 'కదే-కదా'లు సమానార్థకము లని రూఢిపరచుచున్నదికదా.

6. శుష్క కీచక రంధ్ర నిష్కాస పవనాన :- ఇటనిష్కాసమునకు నిష్కాసనము రూపాంతరము. వెడలుట యని యర్థము. నిష్కాసితమని కర్మణ్యర్థమున గాక కర్త్రర్థమున నిష్కాసపవనానఅనగా వెడలినగాలియందుఅను నర్థము గ్రహింపనగును. 'శుష్కాశ్చతేకీచకాశ్చ, తేషాం రంధ్రాణి, తేభ్యః నిష్కాసః యస్యసః- సచాసౌపవనశ్చ' అని బహువ్రీహి సమాసము చేసి కవిగారు ప్రయోగించిరి. శ్రీ ప్రసాదుగారును బహువ్రీహి చేసిన సరిపోవు నని చెప్పుచు తప్పుగా చూపుట యేలనో తెలియకున్నది.

7. 'ప్రాతపురాణసూక్తులు':- పురాణములందలి సూక్తులు - పురాణసూక్తులు; ప్రాతవైనపురాణసూక్తులు=ప్రాతపురాణ సూక్తులు,అనిగాని ప్రాతవైన భాగవతాది పురాణములయందలి సూక్తులు అని కాని సమాసము చేయవచ్చును. 'సంస్కృత పదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి' అను నన్నయకారికయు, 'ఆంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేనసమస్యతే' అను నథర్వణకారికయు పై సమాసమును ధ్రువపరచగలవు. మఱియు నొక్కొక్క కాలమున నొక్కొక్కసమాసము సంఘ వ్యవహారమున నుండును. శ్రీనాథుని 'దినవెచ్చము' పెద్దనగారి 'అనువసనిశ' అను సమాసము లట్టివే. నేడును 'ప్రాత పురాణము' అనునది జనవ్యవహారమున గలదు. దానినే కవి ప్రయోగించెను.

8. 'మిత్రద్రోహ దుష్కృత్యమున్' - అనుచోట 'దుష్కృత్యమున్' అనుపదము సాధువుకాదనినారు. ఎందుచే సాధువు కాదో నుడువలేదు. నుడివిన సంతసింతుము.

9. వివేకలోభముల ఘర్షణ-శ్రీప్రసాద్ గారు 'అన్నిపద్యములా ఘర్షణను వివరించుట కవసరములా?' యనిరి. ఆ ఘర్ష

# “ఏణరాజు” సమీక్షపై లేఖకు సమాధానము

బ్రహ్మశ్రీ లంకా లక్ష్మీనరసింహాశర్మ గారు (ప్రిన్సిపాల్, శ్రీరామకృష్ణ ఓరియంటల్ కాలేజి నరసరావుపేట) 'ఏణరాజు'పై (రచయిత-శ్రీ వారణాసి వేంకటేశ్వరులు గారు, నరసరావుపేట) ప్రకటితమైన గ్రంథసమాలోచనపై తమ యభిప్రాయమును తమ లేఖలో వివరించిరి. వారు తమ లేఖలో మొదటి పేరాలో 'వారు (విమర్శకులు-ప్రసాద్) చక్కని విమర్శనాదృష్టితో సమీక్షించిరి' వంటి వాక్యమును, ఆ పేరా చివర 'సందియములను', అని ముగింపులో 'సమీక్షయందు .. సరిగా చూచిరో లేదోయని యుల్లేఖించిరి. పైమూడిటిని (ప్రశంస సందేహము, హేళన) ప్రోగుచేసినచో సారాంశము ముచ్చటగొలుపు మూడవదియే యనుటకు సందియము లేదుకదా! వారి లేఖలోని పదింటిని సమాహితముల నొనర్చిన సరిపోవును.

(1) పునీతపదము శబ్దరత్నాకరాదుల యందు స్వీకృత మనిరి. మహాకవిశ్రీ విశ్వనాథవారిచే ప్రయుక్త మనిరి. ఆ పద మర్వాచీన గ్రథితము. అపాణినీయము మహాకవిచే ప్రామాదిక ప్రయుక్తము కావచ్చును. కోశకారులు మనబోంట్ల ప్రయోగములను కూడ నిబంధించుట భాషలో పాణినీ యాపాణినీయ పదములయందలి సమదృష్టివలన కావచ్చును. వారును ఒకరినిజూచి మరొకరు ప్రమాద వశమున 'పునీతులు' కావచ్చును. మరియు కవిగారే 'పునీత' 'పూత' (22వ పేజి) పదములువాడిరి. అనగా వారికి ఆ పదము విషయమున ద్వైధీభావము కల దన్నమాట ఒకేపదము విషయమున కవికి ద్వైధీభావ ముండుట సరి కాదు. పాణినీయముకంటె శబ్దరత్నాకరాదులు ప్రమాణతరములైనచో చెప్పన దేమున్నది? సంస్కృతకళాశాల ప్రాచ్యాచార్యులైన తమకే పాణిని ప్రమాణప్రాయుడు కాడన్నమాట. మాబోంట్లకు ప్రమాణములు కావలసినవి తమకు, తమబోంట్లకు వలసినవి మాకు ప్రమాణము లగుట యేమి?

(2) కౌశికసాఖ్యగోత్రము. ఆఖ్యయా సహవర్తతే ఇతిసాఖ్యం. ప్రసిద్ధితో కూడినది అని యర్థము, తెనుగులోని 'పేరు' 'సంస్కృతములోని 'ఆఖ్య' సర్వథా సమానములు కాబోలు. ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ చ' అని కాబో లమరుని నిర్దేశము. మరి సంస్కృతాంధ్రములలోని పేరు, ఆఖ్య సర్వథా సమానములు కాబోలును. 'వాడు పేరు పొందినవాడు' అనగా ప్రతిష్ఠనందినా డని యర్థమా? నామకరణమైన వా డని యర్థమా? మరి 'ఆఖ్య' కేవలనామమును చెప్పక తెనుగులోని యర్థమును చెందునా? కావున 'సాఖ్యం' అనుచో పేరుతో కూడిన దని చెప్పవలెగాని ప్రసిద్ధితో-కూడిన దని మాత్రము కాదు. కౌశికేన సాఖ్యం - తాదృశం గోత్రం కౌశికసాఖ్య గోత్రం కౌశికుని మూలమున ప్రసిద్ధివడసిన గోత్ర మ'ని తాము వివరించిరి. మీ విగ్రహము ననుసరించి కౌశికునితో, పేరుతో గూడిన, గోత్ర మను నర్థము వచ్చును గాని మీరన్నట్లు వచ్చునా? మీ గోత్ర మేమని యడుగ 'కౌండిన్యస' భారద్వాజస' యిత్యాదిగఁ జెప్పుట శిష్టవ్యవహారమున నున్న దనిరి. శిష్టులెవరు? కౌశికుని కౌశికసగా మార్చినవారా? మీవంటివారు దీనిని సమర్థింపబూనుట విచిత్రము గానున్నది.

(3) వాచావ్రతనిష్ఠుడు- 'సమాసము విచారణీయము. అనగా విచారింపదగినది. 'పైసమాసము వినుటకింపుగా లేదని యభిప్రాయము. ఆ విషయమున విచారింపదగిన దని యర్థము. కాని శబ్దరూపము లేదని కాదు. సంతత వాచావ్రతనిష్ఠుడు, నిరతాన్నదాన భాసుర యశుండు 'ఇట పూర్వార్థపరార్థములలో పరార్థములోని శయ్య మొదటిసగములోనే మైనది? సమాసమనగా పదముల పొందిక యని భావము గాని మీరనుకొన్నది కాదు. సాహసించిపగుల 'నంచవా' కట్టరాదు.

(4) మురిసిపోయినదశ్రే భరతమాత. ఇచట భరతమాత ప్రథమావిభక్తి యనుట సందిగ్ధము కాదు. 'భరతమాత' యను పదము. ఇచట విమర్శలోని (16.11-79 సమాలోచనలోని) వాక్యము నొక్కమారు పరికింపుడు. ఇట భరతమాతయను పదము దేశవాచకము కాక భరతమాతృవాచకమై షష్ఠీతత్పురుష కావలసి యున్నది. ఏది? 'భరతమాత' యను పదము, దాని కర్థమేమి? భరతునిమాత యనియా కాదా? శ్రీ ప్రిన్సిపాల్ గారు తాము పొరబడి యితరులను పొరబడ జేయుచున్నారు.

---

( 15 వ పేజీ తరువాయి )

ణమున ధనప్రాశస్త్యము వివరింపబడినది. ధనము దుష్టవాంఛలకు వినియోగింపరా దను నీతి యిట నిరూపింపబడినది. నేటి సంఘమున ధనసంపాదనకై జరుగు దుండగములు మెండుగనున్నవి. వాని నుద్దేశించి కవి యొనర్చిన ప్రబోధమున కా పద్యము లన్నియు నవసరములే!

10. వాని ప్రకటితమైన పశ్చాత్తాపమునకు; అంతరాంతరముల ఏణరాజు యొక్క అనుభావమహత్త్వమునకు భంజకముగనున్న' దనినారు శ్రీ ప్రసాద్. ఆ ఘట్టము కథాకథనమునకు పుష్టిని తుష్టిని గూర్చినదే కాని భంజకము గాదు. రంజకము గ నున్న దనుట సమంజసము.

శ్రీ ప్రసాదుగారి విమర్శనలో ముగింపు వాక్యమున 'కాకర్లవారి పరిచయము' అని నారు ఆపరిచయము దివాకర్లవారిది గాని కాకర్లవారిది కాదు. పరిచయకర్త యొక్క నామమే వీరు సరిగా గ్రహింపనందున సమీక్షయందు ఏణరాజు కృతిని సరిగా చూచిరో లేదోయని తోచుచున్నది.

మొత్తముమీద నవ్యకవితాలోకమున ఏణరాజునకు సముచితస్థానము గల దని నా యభిప్రాయము.

శ్రీ లంకా లక్ష్మీనరసింహాశర్మ

(5) కీర్తి నల్దిక్కుల నింపినట్టిదిక గే 'భవదీయకరంగరూపమే'-తాము పూర్తిగ చూచినగదా! 'కదే' 'రూపమే' యీ రెంటిలోని రెండు 'ఏ' కారములు చెప్పిన దేయర్థమును. ఇది వినుట కెట్లున్నది? ఇంపుగా నున్నదా? మొదటిది యతికైన రెండవది యెందులకు?

(6) శుష్కకీచరంధ్ర నిష్కాస పవనాన-ఇచట-16.11.78 నాటి సమాలోచనలోని వాక్యముల జూడుడు- 'బహువ్రీహి చేసిన సరిపోవుచు దీనిని విశేషముగ గ్రహింపవలసియుండును. 'ఇచటి సమాసము సద్యస్స్ఫూర్తిగ నున్నదా? విశేషముగ గ్రహింపవలసియున్న దనిన తప్పని యర్థమా? మీకు మీ రేయనుమానములను రేకెత్తించికొని యితరులపై మోపుటేమి?

(7) ప్రాతపురాణసూక్తులు-సమాసము విచారణీయ మనగా తాము గమనించి యుండరు. సమాస మనగా పదముల పొందిక యనియే భావము. ప్రాత,పురాణ (దీనికి ప్రాతయనియు నర్థముకలదు కదా) సు+ఉక్తులు ఇదియును సద్యస్స్ఫోరకముగ నున్నదా? ఇనుపబూరెలమూకుడు (పదము) వలెనున్నది. కవిత్వము పాండితీస్ఫోరకమగుటకంటె సద్యస్స్ఫూర్తితో నుండవలెను. కవిభావము పాఠకునకు సూటిగా వెంటనే మనస్సున నాటవలెను కదా.

దినవెచ్చము, అమవసనిశి (కొందరు అమవసనిసి యనియును నందురు) మున్నగు వానివలె ప్రాతపురాణము కల దనిరి. ఉన్నచో పాతపురాణము గలదు కాని ప్రాతపురాణము కలదా? మరల దానికి 'ప్రాతపురాణ సూక్తుల' ని సమాసమా? అయినచో 'దినవెచ్చభాగ్యము' కూడా జేయవచ్చు నన్నమాట.

8. మిత్రద్రోహ- దుష్కృత్యముస్ - 'దుష్కృత్యము' ఎందుచేత సాధువుకాదో తెలిపిన సంతసింతుమనిరి. సులభపాణినీయులైన మీకు 'దుష్కృత్యము' దుర్లభమేకదా. అగమ్యము, దుర్గమము, దుస్సాధము, మున్నగురూపము లెట్లు నిష్పత్తియైనవో విచారింపగల మీకు 'దుష్కృత్యము' వివరించు సుకృతము మా కెట్లుండును? మీసంతోషమే మాసుకృతము.

9. 'వివేక లోభముల ఘర్షణ':- వీని సంఘర్షణమునకు ధనాశాపీడిత సంఘమునకుపదేశముగా నిన్ని పద్యము లుండవలె ననిరి. ఈ సంఘర్షణములో సుమారు ముప్పదికిపైగా పద్యములున్నవి. ఈ రెండింటి సంఘర్షణమును వివరించుట కిన్ని పద్యములెందుల కవసరము? గజేంద్రుని ప్రార్థన, రుక్మిణీ సందేశము, లేక మరొక ప్రాచీన కావ్యములోని సంఘర్షణఘట్టమెన్ని పద్యములతో నున్నవో? పద్యసంఖ్యనుబట్టి సంఘర్షణముయొక్క విలువ ననిశ్చయించుట సరియైన పద్ధతియా? వెనుకటివారు ఇన్ని పద్యములఁ జెప్పలేక సంగ్రహించిరా? (మనకంటె) ప్రజ్ఞాచక్షులైన కవిలోని పదములు గ్రుడ్డివాని చేతి రాళ్ళు కారాదు. పద్యముల సంఖ్య హెచ్చిన పాఠకునకు (సహృదయులకు) విసుగు కలుగదా? ఈపద్యములలో వివేకలోభముల సంఘర్షణలో దేని కెన్ని రచింపబడినవి? తుదకు పైచేయి దేనిది (ఆఘట్టములో) దీనివలన పాఠకున కేమి కలుగును? ఆలోచించితిరా? కంఠోక్తిగా 'ఆపద్యము లన్నియు నవసరములే యని పలుకుచున్నారు.

10. వాని ప్రకటితమైన పశ్చాత్తాపమునకు అంతరాంతముల ఏణరాజుయొక్క అనుభవమహత్త్వమునకు భంజకముగ లేదని మీ రంటిరి. ఏణరాజును బట్టి తెమ్మని రాణిపట్టుదల వహించెను. రాజుయత్నించి తుదకు మహానుభావుడగు వేణరాజును గాంచెను. వానిని దర్శించి మహానందపరవశుడయ్యెను. ఏణరాజు మహానుభావుడైనచో, రాజునకట్టి దివ్యానందము కలిగినచో నేమి కోరుకొనును? నేను నీప్రతినిధిగ రాజ్యము పాలింతును. నాసింహాసనమునుండి దివ్యబోధ జేయుదును. నీవు రాజ్యమునకు వచ్చినచో నేను నిన్నుదెత్తు ననిరాణి కిచ్చిన 'బాస' నెరవేరుట ప్రజలు తరించుట యను రెండు ఫలితములు కలుగును. అని ప్రార్థించెను. ఈ ప్రార్థనలో రాజులో నున్న రాజనీతి, లౌక్యము, భార్యావిధేయత కన్పడుట లేదా? వాని ప్రాధాన్యము వివరింపదగియున్నదా? మరింత సూక్ష్మముగ నాలోచించిన వేణరాజు రాజునకు సరియైనయనుభావము కల్గించలేక పోయె ననియు భావింపనగును.

తరువాత 'దివాకర్ల' వారికి బదులుగా 'కాకర్ల' యని యుండుట ముద్రారాక్షసమేమో యని వీరాలోచింపలేకపోగా దీనిని సమీక్షకుని యసమగ్రదృష్టికి ముడిపెట్టిరి. 'ఏణరాజు' లోనున్నది దివాకర్లవారు కాకర్లవారగుట ముద్రారాక్షసమని భావించు నంతటి సహృదయత విచారణ వీరికి కలుగుగాక. కవిగారియందలి యభిమానముచే వీరు విమర్శకునిపై హేళన కరిపించిరి. అది యుపక్రమ నిర్వహణోపసంహారముల యందు క్రమప్రాప్తరూపమై సాక్షాత్కరించును. విమర్శకుడు దేశకాలాద్యభిమానాతీతుడు సహృదయుడు సమబుద్ధి. అభిమాను లందుకు భిన్నులు. అభిమానులు సహృదయ, విమర్శకులుగ, మారుటకు యత్నించిన బాగుండును.

- శ్రీ ప్రసాద్

# శ్రీ నీలకంఠేశ్వరా!

( నీలకంఠేశ్వర శతకమునుండి )

— "కవిగణపతి"

---

భవశబ్దోద్భవభావమోభవ! భవ
ద్భావమ్ము, తచ్ఛబ్దమున్
భవదాత్మశ్రుతి, భావశబ్ద విభవ
ద్భ్రాజిష్ణువౌ కావ్యమున్
భవదిచ్ఛాకృత కేళి, నేనెవడ నీ
పద్యావళిన్ గూర్పగా
శివ! నీ వ్రాయసకాడ నింతె కదయా!
శ్రీ నీలకంఠేశ్వరా!

శిపివిష్టుండగు వాడు ధూర్జటి యగున్
శ్రీమద్భవన్నామ మం
త్రపు మాహాత్మ్యముచేత స్థాణువును స
ర్వజ్ఞుండగున్ భిక్షుకుం
డెపుడో యీశ్వరుడై చెలంగు భవుడున్
మృత్యుంజయుండౌను కొం
చెపుమేనున్ గలవాడు భూతపతియౌ
శ్రీ నీలకంఠేశ్వరా!

దగదొట్టన్ బరుగెత్తి దేవతలు పా
దద్వంద్వమున్ బూజసే
యగ నే వత్తురొ! లేక నీసిగను బు 1
వ్వైయున్న యబ్జాఖ్యనం
దొగిఁ బీయూష మె క్రోలవత్తురొ! స్ఫుర
ద్ద్యోవాహినీ ధారలో
సిగమున్కల్ గొనవత్తురో! తెలుపవే!
శ్రీ నీలకంఠేశ్వరా!

నను బ్రోగించెడు గుండె దేవళముగా,
నాయాత్మ లింగమ్ముగా
గను, రక్తమభిషేకతోయమునుగా
గన్, బ్రేవులే పత్రిగాన్,
దినుకూడంత నివేదనమ్ముగనిటుల్,
దివ్యమ్ముగాఁ గొల్వనో
చినవాడన్ జినవాడ నోపు కొలదిన్
శ్రీ నీలకంఠేశ్వరా!

త్రిపురారీ! వినినాడ 2 మిత్తికిని మి
త్తిన్ గూర్చినా వంచు, నే
నిపుడీపూటకునీ 3 యసల్ దెలియనో
యీ! నీయసల్ దర్శన
మ్మెపుడైనన్ సరె మిత్తికిన్ వెరవనో
యీ! మిత్తియేపాటిదో
చెపుమోయీ! భవదీయ భూతిసరసన్
శ్రీ నీలకంఠేశ్వరా!

ముక్కంటీ! నను నీచిరప్రకృతిలో
ముక్కంటి, నీశాన్యపున్
దిక్కంటించిన నీదు జ్యోతి నిక నా
దిక్కంటి, నామేనె నీ
యిక్కంటిన్, మతినిల్పితిన్ ఛవిగ నా
యిక్కంటికిన్, నాకు పెన్
జిక్కంటిన్ నమ నొంటిగా విడచినన్
శ్రీ నీలకంఠేశ్వరా!

ఘనుఁడీవౌటను జీవనంబులు తలన్
గల్పించుకొంటే? శివా!
నినుబోలన్ ఘనయోగి జీవనములన్
నిల్పున్ దలన్, సర్వదా
ఘనుడౌ వానికి జీవనంబులు దలన్
గల్గున్ గదా! వేళవ
చ్చినచో జీవనమిచ్చు వాడె ఘనుడౌ
శ్రీ నీలకంఠేశ్వరా!

చిరునవ్వున్ జిలికించు బాలుని ముఖ
శ్రీనిన్, మహోదాత్తమై
సరసమ్మైన కవిత్వ మల్లు కవిహృ
చ్చాంపేయమున్, భక్తి సం
భరితమ్మౌ నరజన్మమున్ సతము సం
భావింతు, నన్యంబులౌ
సిరులున్ వాసనలున్ భవమ్ము దలపన్
శ్రీ నీలకంఠేశ్వరా!

నాకుల్ నాకన నాకు నాకన సుధన్
నాకించి నాకించి నా
కే కొంచెమ్మును నుంచలేదయిన హా
ర్షింతున్, జరామృత్యువుల్
లేకుండన్ మనులేఖులున్ గనని మేల్
శ్రేయంబు నాకెమ్మెయిన్
జేకూరున్ నినుగోరు నంత ననుచున్
శ్రీ నీలకంఠేశ్వరా!

బడి నంబిన్ గట్టెపల్లి నందె నృహరిన్
పార్వెళ్ళ చెప్యాల మా
మిడిపల్లిన్ మునుగోటి మహ్మదలి మా
మిండ్లన్ మహాదేవు తం
గుడిగెన్ గుండిని గీట్ల శంకరు శకా
ఖ్యన్ రాగి తత్త్వాది నో
మృడ! ప్రోవదగు సత్కవీంద్రసమితిన్
శ్రీ నీలకంఠేశ్వరా!

---

1 పువ్వు. బువ్వ, 2 మృత్యువు వడ్డి మూలధనము, నిజరూపము, 4 నంబి శ్రీధరరావు, గట్టెపల్లి సత్యనారాయణ రాజు, అందె వేంకట రాజము, వేమూరి లక్ష్మీనరహరిశాస్త్రి, పార్వెళ్ళ గోపాల కృష్ణశర్మ, చెప్యాలరామ కృష్ణారావు, మామిడిపల్లి సాంబశివశర్మ, మునుగోటి కృష్ణమూర్తి, మహమ్మదలి, మామిండ్ల రామగౌడు, మహాదేవ శ్రీనివాసరావు, తంగుడిగె శ్రీధరరావు, గుండి వేంకటాచార్యులు, గీట్లజనార్దనరెడ్డి, శ్రీగాదె శంకరయ్య, శుకశ్రీ, రాగి చిన్నయ్య తత్త్వాది కృష్ణశర్మ.

"వెలుగుంకోకివస్తూ చీకటికి బలై పోయిన యువకవి"

# నూతలపాటి గంగాధరం

— శ్రీ కల్రా కార్తికేయశర్మ.

(గత సంచిక తరువాయి)

'ప్రభుత్వాలే లాటరీ లయ్యాయి
ప్రజలే పోషకు లయ్యారు
గజానికో ఇజం గజమై పిలిచింది
ఇజానికో నిజం భుజమై నిలిచింది'
'చిత్తం స్థానంలో విత్తంపీ లేసుకుంది
మేధాశక్తిని స్వార్థసర్పం వాటేసుకుంది
ప్రతినరుడూ ఒక పూర్తికాని చిత్రం
మాటలు నోటికిరాని నాటకపాత్ర.'

పేరాసతో ప్రజలలో దురాశను పెంచే ప్రభుత్వలాటరీలు ప్రజలపోషకత్వంలో పచ్చగా పెరుగుతున్నాయి. లక్ష చెమట బిందువులు రూపాయిలు గామారి ఒక్కన్నెవరి స్తేవాడికిమాత్రం వెలుగు. మిగిలిన వారందరికీ మిగి లేది చీకటిమాత్రమే! పైగా ఈప్రభుత్వాలే సామ్యవాదాన్ని వేదంలా వల్లిస్తాయి. (అర్థం తెలిస్తేగా?) గజగజానికి ఒక్కొక్క ఇజం అంకుశానికి మాత్రమే లొంగే గజాలై నిల్చున్నాయి. విత్తం చిత్తాన్ని చిత్తుచేసింది. మేధాశక్తిని స్వార్థసర్పం ఆక్రమించుకుంది. అందుకే ప్రతినరుడూ పూర్తికాని 'చిత్రం'లా వెలవెల పోతున్నాడు. మాటల్ని తడుముకునే పాత్రధారిలా కోశనకు గురౌతున్నాడు.

ఒంటిగా ప్రేమించలేను' అంటున్నాడీకవి.

నాకూ ప్రేమించాలని ఉంది
నా భాషను, దేశాన్ని!
చెంతకు చేరదీసి
చెక్కిలితో చెక్కిలి చేర్చి
చెలిమి కౌగిట బంధించి
సిగ్గు ముసుగును తొలగించి
నాకూ ప్రేమించాలని ఉంది'

మరి ఏమిటి అభ్యంతరం? ఆదికవినాటి ఆంధ్రభాషనే ప్రేమించాలంటే గీర్వాణ రాణీరేవి అడ్డుపడక మానదు. ఆధునిక ఆంధ్రభాషను ప్రేమించాలంటే చిలిపి కళ్ళ ఆంగ్లదొరసాని 'లిప్ స్టిక్' పెదాల ముద్దులు తప్పవు. అందుకే ఆంధ్రభాష అనే గడుసుపడుచును ఒంటిగా ప్రేమించడం సులభంకాదని ఆమె నెచ్చెలులనుగూడా ఏకంగా ప్రేమించడం నేర్చుకున్నాడీకవి.

మళ్ళీ ఏదో ఆశ
'పోనీ ఆంధ్రదేశాన్ని
అచ్చమైన నాఆంధ్ర దేశాన్నిఅయినా
అచ్చంగా మరీ పచ్చంగా
పచ్చందీపం వేసుకుని
ప్రేమించాలని చూశాను'

కాని మరో విధంగా అభ్యంతరం వచ్చిపడింది. హైదరాబాదు నుంచి ఉరుదూ సాకి బెదురు కనులూ, అనంతపూరునుంచి కన్నడ ప్రౌఢగడుసు చనులూ, చిత్తూరు నుంచి అరవజవరాలి భరతనాట్యం నడుమూ, ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి చేస్తే తెలుగుపడుచుతోపాటు పరిచరులను గూడా ప్రేమించడం అలవాటు చేసుకున్నాడు పాపం! గంగాధరం. అప్పుడు తీరిగ్గా ఊపిరి పీల్చుకుని ఇలా అంటున్నాడు.

'అన్నిటినీ అందరినీ ప్రేమించేశాక
నా బ్రతుకు
ఇరుకులోంచి బయటను పడ్డట్టయింది
నాభాష అన్ని భాషల జీగిబిగితో
పదు నెక్కిందనీ
ఆభాగ్యం మరొక దేశభాషకు లేదనీ
మురిసి పోతున్నాను.
నాదేశం కడలి అనీ
అన్నిభాషా వాహినుల కూడలి అనీ
గర్విస్తున్నాను.'

ఓటమి కలిగినప్పుడు కూడా సెలవి వారా నవ్వడ మంటే ఇదే నేమో!

'మట్టిబొమ్మలు' అనే కవితలో మనుష్యుల మూర్ఖతను వాపోతున్నాడీకవి.

'మట్టిదీపాలు ముద్దుపెట్టుకుని
ఒకదానొకటి వెలిగించు కొంటున్నాయి
మేఘాలు ఒకదానొకటి కౌగిలించుకుని
మెరుపుల్ని సృష్టించుకొంటున్నాయి.
నింగిలోని చంద్రుడు నేలమీదకు వొంగి
నీటిలో తన ప్రతిబింబం
చూసుకొంటున్నాయి.
కొమ్మమీద పక్షుల జంటలు
రెక్కా రెక్కా కలిపి
కువకువ లాడుతున్నాయి.

సృష్టిసర్వం తేడాలు మరచి, భేదాలు విడచి, వెలుగును నించుకొని, వెన్నెలను పంచుకొని స్నేహాన్ని దొంగిలించుకుం టుంటే...

'మట్టిలోపుట్టి మట్టిలో కలిసే
మట్టి బొమ్మలు మాత్రం మధ్యకాలంలో
మూతులు ముడుచుకొని
మూర్ఖంగా దూరమవు తున్నాయి'అంటూ

మనుష్యుల 'గడుల గడుల జీవితానికి చింతిస్తున్నాడు.

'పుట్టిన నాడే మృత్యువును
వెంటబెట్టుకొని వచ్చి
బ్రతికి నన్నాళ్ళు మృత్యువును
తనలో దాచుకొని తిరిగి
ఎప్పుడోఒక నాడు చెప్పకుండాపగిలిపోయి
మట్టిలో కలిసి పోయే మట్టిబొమ్మలకు
వట్టి పట్టు దలలు పెద్దవి' అంటూ

అల్పమైనబ్రతుకులకు అనల్పమైన గిరులు వద్దని సమైక్యతను బోధిస్తున్నాడు.

'అన్ని పాత్రల పదార్థం ఒక్కటే!
అన్ని పాత్రల నిర్మాణం ఒక్కటే!
మట్టీ మట్టీ మంచిగా పలకరించుకొని
మమతల్ని పెంచుకొంటే
మట్టే బంగారమవు తుంది.'

కవిత్వం ఎలా ఉండాలి? అని ప్రశ్నిస్తే- రకరకాల సమాధానాలు వస్తాయి. అప్పుడు ఏ సమాధానాన్ని ఆధారం చేసుకొని కవితను ప్రేమించాలి అని పాఠకుడు సందేహంలో పడతాడు. నూతల పాటి గంగాధరం ఇచ్చిన సమాధానం మాత్రం సందిగ్ధతకి అతీతంగా గడుసుగా ఉంది.

'జలదం జల్లు కురవాలి
అది చల్లగుండాలి
పూవు పండు నివ్వాలి
అది తియ్యగుండాలి
సూర్యుడు వెలుగునివ్వాలి
అది తెలివి నింపాలి

కవితలో ఇవి మూడూ ఉండాలి' - దీన్నే మరింత వివరిస్తూ
'సేద తీర్చేది ఒకటి
శక్తి నిచ్చేది ఒకటి
ఇవి మూడూ చేకూర్చేది కవిత!'-

ఈ లక్షణాలు లేని కవిత ఎలా ఉంటుంది?

'సేద తీర్చని కవిత
నిప్పుల వాన లాంటిది
శక్తి నివ్వని కవిత
కుళ్ళిన పండులాంటిది
చైతన్యం కూర్చని కవిత
చీకటి గుయ్యారం లాంటిది
ఏదీ లేని పాట
నరకానికి బాట'

తడబాటు లేకుండా పలికిన ఈ కవిత స్థిరనిర్ణయ నవత.

'చెడిన కాన్వాసుపై కుదరని చిత్రాలు' ప్రదర్శిస్తున్నాడితడు చూడండి.

'పాతిక సార్లు చదివినా
ఫలానా అని బోధపడని
అరపేజీకి అరవై అచ్చు తప్పుల
అందమైన గ్రంథానికి-ఒళ్ళు మండి
'ఆగస్టు పదిహేను' అని
హెడ్డింగు మార్చాడు
కొంటె విద్యార్థి ఒకడు'

స్వాతంత్ర్యాన్ని అందమైన వ్యంగ్యంతో చిత్రించిన కవిత తెలుగులో బహుశః ఇదేనేమో!

'పాతికేళ్లు వచ్చినా
పెళ్ళి భాగ్యానికి నోచుకోని
వృద్ధకన్య
'స్వతంత్ర మంటే నాదే' అన్న
గ్రామఫోను రికార్డు వింటూ కూర్చుంది'
'సకాలంలో తడి
సత్తువ పడని మడిని చూచి
'పాతిక చాళ్ళు దున్నినా
ఫలితం మామూలే!' అని
నిట్టూర్చాడు నిరుపేద రైతు'
'పాతికేళ్ళు సర్వీసు - తపస్సు చేసినా
ప్రమోషన్ - వరం ఎరుగని
రెకమండేషన్ లేని గుమాస్తా-మూని
'వందేమాతరం మందే భారతం' అని
జపంచేస్తూ జనంలో కలిసి పోయాడు'

'పాతిక రంగులతో
పాతికమార్లు ప్రయత్నించినా
చిత్రంలో జీవం కనిపించకపోగా
చేయితిరిగిన చిత్రకారుడు చివరకు విసిగి
'కాన్వాసులోనే ఏదో లోపముం'దని
గొణుక్కున్నాడు స్వగతంగా!'

శ్రీ ఆరుద్ర అన్నట్లు 'స్వరాజ్యం పట్ల లేనిపోని ఆశలు పెట్టుకొని సామాన్య జనంతోపాటు సాహితీపరుడు కూడా మోసపోయాడు' ఆ మోసము అందించిన ఆవేదనే ఈ కవితారచనకు నాంది పలికింది.

'వెలుగులోనికి' అనే టైటిలు కవితలో

'చీకటినుంచి వచ్చాను-వస్తూ
జీవితమే ఒక కాంతికమలం అనుకున్నాను
చిక్కదారినుంచి వచ్చాను
చిక్కదారులే భూమ్మీద
వుండవనుకున్నాను
ఏడుస్తూ వచ్చాను
ఏడుపుతో ఇక పనేవుండదు
బ్రతుకు బ్రతుకంతా హాయిగా
ఆశతీరా నవ్వుకోవచ్చు ననుకున్నాను'

తీరావచ్చాక తన కలలు కల్లలని గ్రహించి, కలల్ని నిజం చెయ్యాలన్న మహాసంకల్పంతో

'నిరాశనుంచి వచ్చినా
అందరిలో ఆశల విత్తులు నాటి
ఆశయాల చెట్లు ములిపిస్తాను.
వంచననుంచి వచ్చినా
మంచిమాగాణిని సాగుచేసి
మానవత్వం పంటలు పండిస్తాను
అడవినుంచి వచ్చినా
అరణ్యాలకు సైతం ఉషస్సుధల్ని పంచే
అమరగీతికల్ని రచిస్తాను
కత్తులవంతెన మీదినుంచి వచ్చినా
కాలం కన్నీటిని చెరిపి
కాంతిచరిత్రను సృష్టిస్తాను
చీకటినుంచి వచ్చినా
చీకటిలోకాన్ని వెలుగులోనికి
నడిపిస్తాను' అంటూ

ఆరోగ్యమైన నిర్ణయాలతో పురోగమిస్తున్న ఈ యువకవి

'ఏ పంచాగమూ ప్రకటించలేదు
ఈదినం ఆకాశాన్ని
ఇన్ని మేఘాలు కప్పేస్తాయని!
ఏ శాస్త్రవేత్తా చెప్పలేదు
ఈరోజు అందరి మనసుల్లో
ఇంత చీకటి వ్యాపిస్తుందని!'

అన్నట్లుగా చీకటికి బలైపోవడ తెలుగువారి దురదృష్టం.

'మెత్తగా కవితను పలికిన
సుతిమెత్తని చిత్తమువాడు
కాలనాగు విషమునకు ఒరిగిపోయాడు
తటిల్లతలు మెరిపిస్తూ
విరిజల్లులు కురిపిస్తూ
మనసును మైమరపించిన
మేఘుడు లేడు కనరాడు.'

—— •• ——

తాత్త్విక నవల - 1.

# అసమర్థుని జీవయాత్ర - హేతువాద పరాస్తము

- డా. ఉప్పలపాటి శ్రీరామమూర్తి

జీవితాన్ని చూచి దాన్ని యథాతథంగా స్వీకరించలేక, లేనిపోని తర్కంతో వాస్తవిక జీవితాన్ని కలుషితం చేసుకుని, బాహ్య ప్రపంచంతో రాజీపడలేక, విపరీతమయిన మనోవైకల్యానికి గురై, తాను సుఖపడక, ఇతరులను సుఖపడనీయని ఒక అసమర్థుని జీవితాన్ని ప్రతిబింబించే నవల అసమర్థుని జీవయాత్ర. రచయిత గోపీచంద్ నవల్లోని కథానాయకునితో చాలవరకు తాదాత్మ్యాన్ని పొందినందువల్ల నవలారచన వాస్తవికమై సహజసిద్ధంగా పరిణమించింది. ఈనవల్లో మానసిక విశ్లేషణను రచయిత అద్భుతంగా వ్యక్తీకరిస్తాడు. కథానాయకుని మానసిక పరిణామమే రచయిత పొందడం నవల్లోని జీవత్వం.

సీతారామారావుది జమీందార్ల కుటుంబం. తాతతండ్రులు చాల గొప్పదాతలు; అని అతడు తెలిసి కొనేటప్పటికి ఆస్తి చాలభాగం గతించిపోయి వుంటుంది. అవసానదశలో వున్న తండ్రి కుమారుణ్ణి వంశం పేరు నిలబెట్టవలసినదిగా ప్రాధేయపడతాడు. అది సీతారామారావు ఆజ్ఞగా తీసుకుంటాడు. తండ్రికోరికను కార్యరూపంలో పెట్టడంతో వున్న కాస్త ఆస్తిగూడా హరించి పోతుంది. జమీందారు కుటుంబంలో పుట్టిన సీతారామారావుకు సామాన్యునికిమల్లే ఉద్యోగం చేయకతప్పలేదు. ఒకరిక్రింద ఉద్యోగం చేయడం అంటే సీతారామారావుకు తలవంపులుగా వుండేది. తనంతటివాడు ఒకరికి ఇంత పెట్టగలగాలి కాని మరొకరి క్రింద చేయిచాచి బ్రతకడం కూడని పని అనే విచిత్ర మయిన మనస్తత్వంగలవాడు సీతారామారావు. ఇంట్లో వుంటూ నాల్గుగోడల మధ్యనే కాపురం చేస్తూ జీవితం అంతా బాధ్యతారహితంగా. కాలక్షేపం చేద్దాం అనుకుంటాడు ఉన్న ఉద్యోగం పోయేట్లు చేసుకోవడంతో అల్లునికి మళ్ళా ఉద్యోగం చూచే ప్రయత్నం మామగారు మానివేస్తారు మామగారు చూపించిన ఉద్యోగంపై ఆధారపడటం సీతారామారావుకి నామోషీ అయి చేసే చేసే ఉద్యోగానికి రాజీనామా చేస్తాడు. మేనమామ తన కీయాల్సిన బాకీ పద్దుక్రింద ఎందుకూ కొరగాని చవుకబారు పొలాన్ని అంటకడతాడు. కుటుంబం గడవటం కష్టమౌతుంది. సంపాదనా మార్గం వెదకడం సీతారామారావుకి ఇష్టంవుండదు. నిక్షేపంగా కాలం గడచిపోతూంటే బావుంటుంది. అనే మనస్తత్వంతో ఏపనీ చేయకుండా గోళ్ళు గిల్లుకుంటూ నాల్గు గోడల మధ్యనేఅతను ఉండిపోతాడు.

ఉద్యోగం పోవడం, మేనమామ ద్రోహం చేయడం సీతారామారావు జీవితాన్ని పూర్తిగా మార్చివేస్తాయి. ఎక్కడలేని చికాకు అతనిలో చోటు చేసుకుంటుంది. జీవితంపై ఒక రకమయిన కసి, పగ అతనిలో మొలకెత్తుతాయి. వంశంపారంపర్యంగా వచ్చిన అహంకారం సీతారామారావులోని కార్యదీక్షను పూర్తిగా నాశనం చేస్తుంది. భార్యా-బిడ్డలపై తరచూ కోప్పడుతుంటాడు' 'జీవిత జంజాటం పడలే' నంటాడు. ఏ విషయాన్ని గూర్చి వెంటనే ఒక నిర్ణయానికి రాలేడు. ఒకప్పుడు మంచి అనుకున్నదే మరుక్షణంలో సీతారామారావుకి చెడ్డ అవుతుంది. అనేక విధాలుగాఆలోచనలు పెంచుకుని తనలో తాను మథనపడుతుంటాడు. చివరకు అతను ఆలోచించడమే ఒకతప్పు అనే నిర్ణయానికి వస్తాడు. బాహ్యప్రపంచంతో పైవిధంగా ఘర్షణ పడి ఓడిపోయానని అనుకోవడంతో సీతారామారావు ఆత్మ విశ్వాసాన్ని కోల్పోతాడు. అతనిలో జీవితంఎందుకు అనేప్రశ్న తలెత్తుతుంది. జీవితం సాధ్యమయితే బతకడం లేకపోతే చావడం అనే నిర్ణయానికి వస్తాడు.

దీంతో కుటుంబంలో ప్రశాంత జీవనానికి బాగా దూరమవుతాడు. తగినంత కారణం లేకుండా కూతురిపై చేయిచేసుకుంటాడు తర్వాత బాధపడతాడు. తన బాధను అర్థంచేసుకోలేదని లోకంపై అతనికి కసి. పని మనిషినిపెట్టుకొనే తాహతులేనందు వల్ల అన్ని ఇంటిపనులు చేసి భార్య మూలబడటం సీతారామారావుకి గిట్టదు. చేతులారా జబ్బుతెచ్చుకుంది అని భార్యపై కోప్పడతాడు. ఆ జబ్బుకు తన అశక్తతే కారణం అనీ అతడికి తెలీక పోలేదు. అశక్తతను తొలగించుకునే మార్గం వెతకడు. పైగా దానిపై తనకి కోపం, లోకంపై తెలీని ఒకవిధమయిన ప్రతీకారవాంఛ సీతారామారావులో ఎక్కువౌతాయి.

అతనిలోని కాఠిన్యమే లోకానికి కనపడుతుంది కాని దానికి కారణ మయిన తన మెత్తనిహృదయం అంటే ఏమిటి అని స్నేహితుణ్ణి అడుగుతాడు. నరాల బలహీనత అని తెలుసుకున్న సీతారామారావుకు తనలోని హృదయమార్దవం జబ్బు ఎలా అవుతుందనే సమస్య ఎదురౌతుంది తను మంచివాడు కనుకనే లోకంలో ప్రతి అన్యాయమునూ తను సహించలేకపోతున్నాడు.ఆ అసహనం తనమంచితనం వల్లనే కాని నరాలబలహీనత వల్లకాదు. మంచితనానికి నరాలబలహీనతకు సంబంధంలేదు. లోకందృష్టిలో మంచితనం నరాల బలహీనతగా కన్పిస్తుంది. తనలో ఈనరాలబలహీనత ఎందువల్ల వచ్చిందని ప్రశ్నించుకుంటాడు. 'ఆలోచనలవల్లనే.

నాకిన్ని ఆలోచనలు ఎందుకు రావాలి... ఏపనీచేయక కూర్చోటం వల్ల...నాకు ఎందుకు చేయ బుద్ధి పుట్టడం లేదు.... పరిస్థితులవల్ల ..ఇక నాబాధ్యత ఏమిటి ? పరిస్థితులు మార్చుకో ..ఎలా మార్చను పరిస్థితుల్ని మార్చుకోవాలంటే ముందు మార్చుకోవా లనే బుద్ధి కలగాలి ... ఆలా బుద్ధి కలగా లంటే పరిస్థితులు మారాలి... నేనేం చెయ్యను' — ఈ విధంగా సీతారామా రావు తనలో తనే ప్రశ్నించుకుని సమాధానం చెప్పుకుం టాడు

తనఅసమర్థతని కప్పిపుచ్చుకునేందుకు కారణాలు వెతుక్కుంటాడు. బుద్ధికి పరిస్థితులకి మధ్య కుతర్కం నిర్మించుకుం టాడు. అతడికి ప్రపంచం అంతా ఏకమై హింసిస్తూన్నట్లు, ప్రపంచభార మంతా తనొక్కడే మోస్తున్నట్లు, భావాలబరువుతో పాతాళానికి క్రుంగి పోతున్నట్లు అనిపిస్తూంటుంది. అభిమానం అడ్డంవచ్చి భార్యతో సహితం ముఖాముఖి మాట్లాడ లేకపోతాడు. అనవసరంగా కావాలని ఆమెతో తగాదా పెంచుకొంటాడు. తను చేసేపని బాగాలే దని అతని మనస్సుకు తెలుస్తూనేవుంటుంది. అయితే ఆపని చేయకుండా వుండలేకపోతుంటాడు.తను చేస్తూన్నది మంచిపనికా దని తెలుసు. మంచిది అనుకున్నది చేయలేకపోతుం టాడు. దీనికి కారణం ఏమిటి అని ప్రశ్నించుకుంటాడు. పదార్థానికీ ఆత్మకీ వున్న సంఘర్షణే ఇది అనుకుంటాడు. తాను పదార్థం ఆత్మల సంయోగ మనుకొంటాడు. తనలో పదార్థం బలమే ఎక్కువ అని, ఆత్మ దానికి లోబడి వుంటూన్న దని గ్రహిస్తాడు తన్నుతాను పట్టుకొని బలంగా గుద్దుకుంటాడు. భార్యను కొడతాడు. ఇంటిపైని అతడికి విరక్తి. ఒక్కసారి తనపెళ్ళయిన కొత్తలోని జీవితాన్ని నెమరువేసుకుంటాడు అప్పటి నిర్మలమయిన ప్రేమకు తానిప్పుడెంతదూరంలో వున్నదీ, త నెంత మారి పోయిందీ తలపోసుకుంటాడు. అప్పటి తనఫోటోలోవున్న సౌమ్యమూర్తి ఇప్పటి పిశాచాకారాన్ని చూచి విచారపడ్తున్నట్లు అనిపిస్తుంది. అతడికి తన శరీరం పెరుగుతున్నట్లు, ఇల్లు ఇరుకవుతున్నట్లు, కత్తుల బోనులో తాను ఇరుక్కుని పోతూన్నట్లు అనిపించి భయంతో రోడ్డుమీదకు వస్తాడు. మహారణ్యాల్లోకి వెళ్ళి దారులు కొట్టి స్వేచ్ఛగా బతకా లనిపిస్తుం దతనికి సంఘం కట్టుబాట్లు, నియమాలు, ఆచారాలు, న్యాయశాస్త్రాలు-ఏమీలేకుండా వుంటే తనకి హాయి నిస్తుం దనుకుం టాడు. సీతారామారావుకు లోకంఅంతా గందరగోళం.

రామయ్యతాత ప్రశాంతంగా మనుమడితో కాలం వెళ్ళబుచ్చడం చూచిన సీతారామారావుకు అసహ్యం వేస్తుంది. జీవితం పిచ్చివాడి రూపం ధరించి తనను తరుముతూంది అనుకొంటాడు సీతారామారావు. వీధిని పడతాడు. వీధిని పడ్డట్టు అతనికి తెలుసు. ఆలోచిస్తున్నది తలలోవున్న మెదడు. నడుస్తున్నవి కాళ్లు. మెదడు చెప్పినట్లు చెయ్యాలని ఎక్కడుంది, అని తన అవయవాలకు సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చిందనుకుంటాడు. రోడ్డు కూడలిలో ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించి ఒక ఉపన్యాసం ఇస్తాడు. ఒక సభలోని పెద్దమనుష్యుల్ని బహిరంగంగా విమర్శిస్తాడు. వాళ్ళు చేసిన అన్యాయాలనీ, అక్రమాలనీ ఏకరువుపెట్టి, అసలు తప్పు ప్రేక్షకుల దని చెప్పి వాళ్ళనూ దూషిస్తాడు. ప్రేక్షకజనం రెచ్చిపోయి సీతారామారావును చితక తంతారు. సీతారామారావులో కొంతమార్పువస్తుంది. తన భార్యను నిష్కారణంగా కొట్టినట్లు తలచి, ఆమె క్షమకు పాత్రుడుకావాలని ఆరాటపడతాడు. ఇంకా అతనికి తన అసమర్థత ఏమిటో అర్థంకాదు.

(సశేషము)

# ఈపక్షంలో

## సాహితీ సామ్రాజ్య పట్టాభిషేకము

(నవ్యభారతి వార్షికోత్సవ సభ)

నిజామాబాదు నగరమున ఇటీవల స్థానిక వేంకటేశ్వర దేవాలయమునందు శ్రీ ఎన్. వి. రామానుజాచార్యులుగారి అధ్యక్షతను నవ్యభారతీ ప్రథమవార్షికోత్సవ మహాసభలు దిగ్విజయముగా జరిగినవి. మానవలూరు గ్రామ సర్పంచులు, సాహిత్యాభిమానులు నగు శ్రీ ఎస్. ఎల్. నారాయణ గారు ముఖ్యాతిథులుగా విచ్చేసిరి.

ఇబ్రహీంపట్నం వాస్తవ్యులు శ్రీ గణపతి రామచంద్రరావుగారి సహాయనిధిని నుండి, విద్వత్కవి, అభినవతిక్కన బిరుదాంచితులు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులగారిని, అష్టావధాని శ్రీ అవధానం రంగనాథవాచస్పతి గారిని నూట పదహార్లతో నవ్యభారతి సమ్మానించినది.

ఈ ప్రాంతమునుండి నూతనముగా ఎన్నికైన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు, మధురకవి శ్రీ అందె వేంకటరాజంగారిని, యువకవులు శ్రీ ఎ. సూర్యప్రకాశ్ గారినికూడ సమ్మానించినది. 'ఇందూరు మండల ప్రాచీన సాహితీ వైభవము'ను గురించి కామారెడ్డి సాయం ప్రాచ్యకళాశాల ప్రిన్సిపాల్ శ్రీ తిగుళ్ళ వేంకటేశ్వరశర్మ గారు ఉపన్యసించిరి.

— 'కవిగణపతి' శ్రీ గణపతి రామచంద్రరావు గారు ప్రోత్సాహకవులుగను కవిపోషకులుగను ప్రశస్తివహించి ప్రతి సంవత్సరము ముగ్గురు కవులను సమ్మానించుచు తెలుగు సాహితీ సామ్రాజ్యమునకు వన్నెలను రచించుచు కవితోత్పత్తికి దోహదమొసగుచుండుట, ఆలనాటి శ్రీకృష్ణదేవరాయలను స్మరింపజేయుట తెలంగాణ పూర్వసుకృతమన్న అతిశయోక్తిగాదు.

వారి ఏతత్సాహితీ సేవలను గుర్తించి వారిని 'అభినవ కృష్ణదేవరాయ' బిరుదముతో నవ్యభారతీ తెలుగు సాహిత్య సాంస్కృతిక సమాఖ్య సమ్మానించినది.

ఉత్సవాలలో చివరి యంశముగా శ్రీ ఎస్. వేంకటాచార్యులుగారి నిర్వహణలో నవ్యభారతీ కవిసమ్మేళనము సుసంపన్నముగా జరిగినది. కృతజ్ఞతలతో సభాకార్యక్రమము ముగిసినది.

## సన్మానసభ

శ్రీశ్రీ కవిత్వంపై సిద్ధాంతగ్రంథం వ్రాసి పిహెచ్.డి. పట్టము పుచ్చుకొన్న శ్రీ మిరియాల రామకృష్ణగారిని సన్మానించే నిమిత్తం కళాస్రవంతి యాజమాన్యాన కాకినాడలో సాహిత్య సన్మాన సభ జరిగినది. శ్రీ సోమసుందర్ సభకి అధ్యక్షత వహించిరి.

అధ్యక్షులు, శ్రీమతి డాక్టర్ పి. చిరంజీవినీకుమారి, శ్రీ ఇస్మాయిల్, శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, శ్రీ కనకప్రవాసి, శ్రీ డా. పి. యస్. మూర్తి, శ్రీ పోతుల వీరాస్వామి, శ్రీ ఐ. వెంకటరావు ప్రముఖులు శ్రీ రామకృష్ణగారి రచనా విశేషాలను వివరించి ప్రశంసించారు. కవితాస్రవంతి పక్షాన శ్రీ రామకృష్ణగారు నూతనవస్త్రతాంబూలాదులతో సత్కరింపబడిరి. నగరంలోని కవితాభిమానులూ మిత్రులూ వారిని పూలమాలలతో ముంచెత్తినారు.

## సాహిత్యోపన్యాసము

ఇటీవల రాజమండ్రి ఆంధ్రకేసరియువజన సమితి కార్యాలయంలో సాహిత్య సభ జరిగినది. బెంగుళూరు యూనివర్సిటీ ప్రొఫెసరు శ్రీ డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు 'వీరగాథావళి' అను విషయంపై ఉపన్యసించిరి. ప్రాచీనాధునిక సాహిత్యరీతుల్ని సవిమర్శంగా వివరించి అన్నీ ఉపాదేయాలే అని రసచమత్కారయుతమైన కవిత అన్నిటిలోనూ సమానమే అనీ అభిభాషించిరి.

## శ్రీ వాల్మీకి రామాయణ కృతిప్రదాన కవిసమ్మాన మహోత్సవములు

### - విజ్ఞప్తి -

శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ. విద్వాన్ (Head of the English Department, A. S. Govt. College for Women, Kaki- nada) నిర్వచనముగా అధ్యాత్మరామాయణ భారత భాగవత మహాపురాణములను, శ్రీవేంకటేశ్వర విజయాదిమహాప్రబంధములును, వేణుగోపాలాదిశతకములును, వేణీసంహారాదినాటకములును, పరమపవిత్ర మహర్షుల చరిత్రలు మఱియు ఇతరగ్రంథములు శతాధికములు రచించి స్వయముగఁ బ్రకటించి ఆంధ్రభాషకు ఆంధ్రదేశమునకు మహోపకారము చేసియున్నారు. సలలితసలక్షణ సులభ సుందరభాషలోఁ గల వీరి గ్రంథము లన్నియు దైవసంబంధములు, ధార్మికములు, భక్తిముక్తిదాయకములు.

వీరిపుడు శ్రీ వాల్మీకిరామాయణమును యథామూలముగ సులభసుందరముగ ననువదించి బాలాయోధ్యాకాండములు తొలిసంపుటముగ (450 పుటలు రాయలు సైజులో) ప్రకటించిరి. శ్రీ వేంకటేశ్వరస్వామి కిది అంకితము. శ్రీమద్రామాయణ కృతిప్రదాన మహోత్సవము కవిసమ్మాన కార్యక్రమము ఫిబ్రవరిలో కాకినాడలో జరుప పెద్దలు నిశ్చయించినారు.

ఆసందర్భమున శ్రీ వేంకటేశ్వర కవీంద్రులకు శ్రీవాల్మీకిరామాయణమున రెండు మూడుసంపుటములు ప్రకటించునిమిత్తము వారి శ్రీ దేవీభాగవత ముద్రణ నిమిత్తము కొంత నిధి ప్రోగుచేసి వారి కర్పించుట ఆంధ్రుల కర్తవ్యమని ఒక కార్యనిర్వాహకవర్గ మేర్పడి సన్నాహములు చేయుచున్నది. ఈ సత్కార్యమునఁ బాల్గొన ఉదారు లందఱిని గోరుచున్నాము.

విరాళములు చెక్కులద్వారా కాని నగదురూపమున కాని 'శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ., రామారావుపేట, కాకినాడ-533004' అను చిరునామాకు పంపగోరుదుము. కార్యక్రమ వివరములు, ఆహ్వానసంఘ విషయములు త్వరలో అందరికి పంపగలము.

ఈ సత్కార్యమున శక్తివంచనలేక యెల్లరు తోడ్పడ మఱియొకసారి కోరుచున్నాము.

ఆహ్వాన సంఘం
కాకినాడ.

## -* రచయితలకు మనవి *-

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

\- సంపాదకుడు.


ఆడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్సు వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఓ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వాల్యూములు అతిస్వల్పసంఖ్యలో మాత్రమే ఉన్నవి.

— సంపాదకుడు 'సమాలోచన'


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.